# రచయిత పరిచయము

శ్రీ జాస్తి వేంకటనరసయ్య గుంటూరుజిల్లా తెనాలి తాలూకా పెదపూడి గ్రామమందు 1910 ఆగష్టు 2 న జన్మించెను. తల్లి శేషమ్మగారు. తండ్రి సుబ్బయ్యగారు. తండ్రి గొప్ప పౌరాణికులు. తల్లి బాల్యముననే మరణించుటచే మాతామహి తుమ్మల చెంచమ్మ ఈయనను పెంచెను. ప్రాథమికవిద్య 'కావూరు' నందును, సంస్కృత కావ్యములు 'అమృతలూరు' సంస్కృత పాఠశాలలోను, ఉభయ భాషాప్రవీణ పరీక్ష (1935) కృష్ణాజిల్లా చిట్టిగూడూరు నారసింహ సంస్కృత కళాశాలయందును చదివెను. కాలేజీయందు శ్రీమత్తిరుమల గుదిమెళ్ళ వరదాచార్యులు, శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి, శ్రీ కొల్లూరి సోమశేఖరశాస్త్రిగార్లు గురువులు. ఈయన 1930-1942 జాతీయ ఉద్యమములందు పాల్గొని మూడు వత్సరములు కారాగారవాసము చేసెను. అచట హిందీప్రచారకుడు. గ్రంథాలయోద్యమ కార్యకర్త. భారతదేశ సంచార మొనర్చిన వ్యక్తి. సూర్యాపేట (నల్లగొండజిల్లా) అనంతపూరు, బందరు, రాజమండ్రి, నిడదవోలు, విజయవాడ, కర్నూలు. గుంటూరు, గుడివాడ, మదరాసు, సత్తెనపల్లి, మున్నగుచోట్ల అనేక సారస్వతసభలలో మాట్లాడెను. పలుచోట్ల సన్మానములను పొందెను. దేశభక్తి, స్వధర్మానురక్తి, సారస్వతాసక్తి కర్తవ్యప్రసక్తి అజ్ఞాన విముక్తి విజ్ఞానరక్తి ఆంధ్రాభ్యుదయ వర్తి జాస్తివారి రచనలలోని ప్రశస్తి. ఆ రచనలు నాటక గేయ ఖండకావ్య జీవితచరిత్ర వ్యాసాదిరూపములు పెక్కులు. నేటి జాతీయ సాంఘిక జీవిత సమస్యాపరిష్కార మార్గదర్శకములు. ఈ కవి "భారతీసమితి" అధ్యక్షుడు.

—కోగంటి దుర్గామల్లికార్జునరావు.

—o:o—

# పట్టాభి సీతారామయ్య

మహామేధావుల కాంధ్రదేశము ఉనికిపట్టు, యుగంధరుడు, తిక్కన, తిమ్మరుసు మున్నగు ప్రజ్ఞాధురీణు లిచ్చోటనే యుదయించిరి. గోదావరీ, కృష్ణాది నదీతోయముల పవిత్రమై యలరారు నీ తెనుఁగుసీమ నీ యిరువదవ శతాబ్దిని వెలసిన మనీషులలో నగ్రగణ్యుఁడు మన పట్టాభి సీతారామయ్య. ఆయన ఇంటిపేరు భోగరాజు. వంశము ఆర్వేల నియోగి వంశము. పశ్చిమ గోదావరి మండలములోని ఏలూరుతాలూకా యందలి "గుండుగొలను" అను గ్రామమాయన జన్మస్థానము. ఆయూరి కరణముగారి యేకైకపుత్రుఁడగు పట్టాభి 1880 నవంబరు 24 న జన్మించెను.

## విద్యాభ్యాసము

తల్లిదండ్రులు పట్టాభిని గారాబముతోఁ బెంచిరి. ఐదేండ్ల వయసురాగానే యీబాలుని దేశాచారము ననుసరించి గ్రామమునందలి ప్రాథమిక పాఠశాలయందుఁ జదువవేసిరి. బాలుఁడు చాలఁ జురుకైనవాఁడు. రెండేండ్లలోనే ప్రాథమిక విద్యను బూర్తిగావించెను. ఇఁక నితనికి నాంగ్లవిద్యను జెప్పింపఁ దండ్రి యుత్సాహపడెను. అందులకు ఏలూరు పంపవలసియుండెను. బస్తీకాపురమునుబెట్టి కుటుంబ భారమును నిర్వహింపఁగల



డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్య
మహామేధావి

యార్థికపుష్టి ఆతనికి లేదు. కాని తండ్రి యెట్టులో సాహసించి కుమారుని ఏలూరునందలి యున్నత పాఠశాలలోఁ బ్రవేశపెట్టెను.

పట్టాభి బాల్యమునుండియుఁ జాలఁబొదుపుగలవాఁడు రెండు చొక్కాలు, రెండు లాగులు, రెండు కండువాలతో నాతఁడు వత్సరము గడపువాఁడు. ఆతఁడు ఇతరుల జోక్యము లేక చెడు సావాసమునఁ జేరక శ్రద్ధగాఁ జదువుకొనెను. ప్రతి వత్సరము తరగతియందుఁ బ్రప్రథముఁడుగా నుత్తీర్ణుఁడగుచు నుపాధ్యాయుల యాదరణకు పాత్రుఁడై యుండెను. అతనిబుద్ధి విశేషమున కబ్బురమంది యాతనికిఁ బెక్కురు ధనమును బుస్తకములను బహూకరించుచుండెడివారు. ఆతఁడు ఇతరు లిచ్చిన ధనమును జాగ్రత్తచేసికొని దురభ్యాసములకు లోను గాక, బుద్ధిమంతుఁడై విద్యాసంపాదనముఁ జేయుచు 1894 సంవత్సరమున మెట్రిక్యులేషను పరీక్షయందుఁ బ్రథమశ్రేణిలో నుత్తీర్ణుఁడయ్యెను.

ఇఁక నున్నత విద్యకుఁ గళాశాల యందుఁ జేరవలసి యుండెను. పట్టాభి ఎట్లో వలసిన ధనమును గూర్చుకొని బందరు నోబులు కళాశాలయందుఁ జేరెను. అప్పుడు ఆ కళాశాలా ప్రధానాచార్యులు బ్రహ్మర్షి రఘుపతి వేంకటరత్నము నాయుఁడుగారు. ఆయన ఆదర్శజీవనమూర్తి, బ్రహ్మసమాజ మతస్థుఁడు, దయార్ద్ర హృదయుఁడు, పరోపకార పరాయణుఁడు, మహావక్త, శిష్యవత్సలుఁడు. ఆయన కృపా శుశ్రూష దొరకుటయే మహాభాగ్యముగా ఆనాటి విద్యార్థులు తలంచుచుండెడివారు. అట్టివారి గురుత్వము మన పట్టాభికబ్బుట

పసిడికి తావియబ్బినట్లాయెను. వారి దయకుఁ బాత్రుఁడై మన పట్టాభి కుచిత వేతన సౌకర్యము లభించినది. పట్టాభి కళాశాలయందు జరిగెడి సారస్వత చర్చలయందుఁ బాల్గొని తన యసమాన బుద్ధికుశలతను వాక్ప్రౌఢిమను గనుపఱచు చుండెడివాఁడు. ఆతఁడు విద్యార్థిగానున్నపుడే గొప్ప ప్రతిభావంతుఁడని పేరుఁబొందెను. పట్టాభికి సింగరాజు సుబ్బారావు గారి విద్యార్థివేతనము లభించినది. ఆతఁడు 1896 లో ఎఫ్. ఏ పరీక్షయందు మొదటి తరగతిలో నెగ్గెను.

పట్టాభి సింగరాజువారి యుచిత వేతన సాహాయ్యమున మదరాసునందలి క్రైస్తవ కళాశాలయందు బి. ఏ. చదువ నారంభించెను. అచటఁగూడ నితఁడు గొలఁది కాలముననే విద్యార్థిలోకమున, నుపాధ్యాయ వర్గమున మంచిపేరు సంపాదించెను. ఈనాటి ప్రతిభావంతులు ఎందఱో యానాఁడు మన పట్టాభికి సహాధ్యాయులై యుండిరి. ఆయన ప్రజ్ఞ సర్వతోముఖమై యుండెను.

## వివాహము

తూర్పుగోదావరిజిల్లా కాకినాడలో గంజాము వెంకటరత్నము పంతులుగారు న్యాయవాది వృత్తి నవలంబించి సుస్థిర యశము నార్జించిరి. సంపదతోఁ దులదూగు వారికి పుత్రసంతానము లేదు. ఒక్కతయే కొమార్త. ఆ తనయకు, తగిన వరుని సంపాదింప దేశమంతయు వారు తిరిగిరి. కళాశాలలన్నియు వెతకుచుఁ దుదకు మదరాసు క్రైస్తవ కళాశాలఁ జేరిరి. ఆ కళాశాలా ప్రధానాచార్యునియొద్దకేఁగి యాంధ్ర

విద్యార్థుల పట్టికను గైకొని వారి సూచన ననుసరించి వేంకట రత్నముగారు పట్టాభి సీతారామయ్యకుఁ దమ పుత్రిక నీయఁ దలఁచిరి. పట్టాభి తలిదండ్రులకీవార్త నెఱింగించి వివాహ ముహూర్తము నిశ్చయించుకొనిరి. అతి వైభవముగా వివాహ మహోత్సవము జరిగినది. పిఠాపురపు రాజావారి యేనుగుపై నవదంపతులను కాకినాడ పురవీధులయందు నూరేగించిరి. గృహలక్ష్మి అడుగుమోపిన తోడనే పట్టాభి గృహమునందలి పెద్దమ్మ పరువెత్తెను. నాఁటినుండి పట్టినదెల్ల బంగారమగుచు వారికిఁగలసివచ్చినది. పట్టాభి, మామగారి ధనసాహాయ్యమునఁ జదివి బి. ఏ. పట్టమునందిన వెంటనే యం. బి., సి. యం. అను వైద్య పట్టమునకుఁ జదివి 1901 సంవత్సరములో నున్నత వైద్య విద్యాపట్ట భద్రుఁడయ్యెను.

పట్టాభి వైద్యవృత్తియం దసమాన ధీశక్తిని వెల్లడించెను. రోగనిదానమునం దాతఁ డందెవేసిన చేయి. నిరాడంబరుఁడై ప్రజాసేవా తత్పరుఁడగుటవలన జనుల కాతనియం దభిమానము గలిగినది. అందులకుఁదోడు పట్టిన కేసు లన్నియు విజయవంతములగుచుండుటచే, అతఁడు వృత్తియందభివృద్ధిని బొందెను. ఇతరులకుఁ గష్టములేకుండ ధనమార్జింపసాగెను. సంపాదనయందు సమర్థుఁడని యశమిపించుకొనెను. పట్టాభి సంపాదనతోపాటు ప్రజాహిత జీవనము నలవఱచుకొని దేశసేవకుఁ గడంగెను.

# సహకారోద్యమము

ఆ ప్రజాసేవకునకు సహకారోద్యమమునందు మిక్కిలి యాసక్తి. ఆ యుద్యమమున పట్టాభి సర్వవిధములను గృషి సేసెను. అతడు "ఆంధ్రసహకార పత్రిక"యను నొక పత్రికను స్థాపించి తన్మూలమున సహకారోద్యమప్రచారమును విరివిగా సాగించిన దిట్ట. ఈ ప్రచార ఫలముగా నాతఁడు ప్రజల నాకర్షించిసహకారోద్యమ లాభములను దెలియఁజేసి బందరులో 'కృష్ణా కోఆపరేటివ్ బ్యాంకు'ను స్థాపింపగలిగెను. ఇఁక ననేక గ్రామములందు సహకార పరపతి సంఘములను, కో ఆపరేటివ్ స్టోర్సులను నెలకొల్పెను. పట్టాభి 1937 లో ఆంధ్రరాష్ట్ర సహకార మహాజనసభ కధ్యక్షత వహించెను. ఆ యధ్యక్షో పన్యాసమునందు సహకారోద్యమ పరిణామములను, రిజర్వు బ్యాంకు-రూరలు బ్యాంకుల స్థితిగతులను, దీర్ఘకాలపు వాయిదా పద్ధతిపై ఋణములిచ్చుటవలన కలుగు లాభములను, ల్యాండుఎలియనేషను, కమర్షియలుబ్యాంకుల వివరమును, సహకారోద్యమునందు రైతుకాంగ్రెసు ప్రణాళికలను విశదీకరించెను. తన యనర్గళ వాక్ ప్రవాహమున సభ్యులను ముంచితేల్చెను. ప్రతి విషయమునం దణాపైసలతో లెక్కలను వివరించి శ్రోతలను తన్మయుల నొనర్చెను.

అతఁడార్థిక శాస్త్రములో అపారపాండిత్యమును గడించెను. విదేశముల కేఁగి పట్టభద్రులైె వచ్చిన పెక్కుఆర్థిక శాస్త్రజ్ఞులకంటె పట్టాభి లెస్సయగు ప్రజ్ఞ గలవాఁడు. బ్యాంకింగువిషయముల ందును మారకపు రేట్ల విషయమునను

క్షణకాలములో లెక్కలను దేల్చివేయగల శక్తి గలవా డాతఁడు.

అట్టి ప్రజ్ఞాధురీణుఁడితర రాష్ట్రములవారు జీవిత భీమా కంపెనీలవలన విశేష లాభములు గడించుటఁజూచి యాంధ్రుల కొరక భీమాకంపెనీని స్థాపించెను. అదియే 'ఆంధ్ర ఇన్స్యూరెన్సు కంపెనీ'. దాని శాఖోపశాఖలు దేశమునందంతటను వ్యాపించినవి. అదిగాక 'హిందుస్థాన్ ఇన్స్యూరెన్సుకంపెనీ'ని స్థాపించెను. ఇప్పుడు దేశమందు గొప్ప వ్యాపారమును నడపుచున్న 'ఆంధ్రబ్యాంకు', 'భారతలక్ష్మిబ్యాంకు' లు రెంటిని స్థాపించినవాఁడాతఁడే. పట్టాభి "ఆలిండియాస్పిన్నర్సు ఎసోసియేషను"అను అఖిలభారతపు వడుకునూలు సంఘమున కాంధ్రశాఖను నెలకొల్పి, యాంధ్రభూమిలోని పేదలపాలిటి పెన్నిధియయ్యెను. దానిమూలమున పేదలకు చౌకధరలో వస్తువు లందు నేర్పాటుగావించెను. ఈ విధముగ ప్రజల కఖండసేవ యొనర్చుచున్న ధీరోదాత్తుఁ డాంధ్రావనియందు జన్మించుట యాంధ్రుల యదృష్టమనియే భావింపవలెను. పట్టాభి తన వ్యవహారదక్షతను ప్రజోపయోగమునకు వినియోగించెను.

## రచనలు - పత్రికాస్థాపన

పట్టాభి యుత్తమగ్రంథరచనముతోడను, పత్రికాప్రచారమువలనను, స్వదేశ ప్రజాబాహుళ్యమును సేవించుచు నఖండ గౌరవధురంధరుఁడయ్యెను. జాతీయ భావప్రపూర్ణములై జాతికి నుత్సాహశక్తుల నొసంగు గ్రంథముల నెన్నింటినో

ధ్యాతఁడు రచించెను. అందు ప్రధానమైనది "ప్రపంచ పాలనావిధాన" మను నాంగ్ల గ్రంథము. ఆతడు రచయితగా దేశమునందేగాక ప్రపంచమునందును గొనియాడఁబడునట్లు గావించిన యుత్తమగ్రంథము 'కాంగ్రెసు చరిత్ర'. 1945 తో షష్టి పూర్తి అయిన అఖిలభారత జాతీయమహాసభ (కాంగ్రెసు) యొక్క సమగ్రచరిత్రను ప్రకటింపవలెనని తత్సభా కార్య నిర్వాహక సభ్యులు తలంచిరి. అట్టియొక నింతటికార్యము నిర్వహింపదక్షుఁ డెవరాయని చింతించి, ఆంధ్రనాయకుఁడగు పట్టాభిపై ఆ భారము నిడిరి. పట్టాభి కార్యనిర్వాహకవర్గమువారి యాదేశమునుపొంది గాంధిజీ యాశీస్సులఁబడసి, 1935 వఱ కేఁబదివత్సరముల కాంగ్రెసు చరిత్రమును దనయసమాన ప్రజ్ఞా చాతుర్యమును జూపి రచించెను. ఆతఁడా గ్రంథమును ఆంగ్లమున సగళమగు శైలిలో రచించెను. అది భారతదేశ మందలి యన్ని భాషలయందును బరివర్తింపఁబడి యశేషకీర్తి సంపద నాతనికి గడించిపెట్టినది. ఆ గ్రంథరాజము దేశీయ రాజకీయ వాఙ్మయ రంగమందేగాక ప్రపంచరాజకీయ సారస్వతమునందును నగ్రస్థాన మలంకరించెననుటలో నాశ్చ ర్యము లేదు. పట్టాభి అంతటితో నూరకుండక 1935 నుండి 1947 వఱకు కాంగ్రెసునందు జరిగిన సంఘటనలఁగూర్చి 'కాంగ్రెసుచరిత్ర' ద్వితీయ భాగమును రచించెను. కొడాలి ఆంజనేయులుగారు కాంగ్రెసు చరిత్ర రెండు భాగములను ఆంధ్రభాషలోనికి అనువదించిరి. పట్టాభి 1942 ఆగష్టు విప్లవ సందర్భమున జైలులో నున్నపుడు నాయకుల కార్యకలాపము లన్నియు నొక గ్రంథముగాఁ గూర్చెను. అందుఁ గాంగ్రెసు

కార్యనిర్వాహకవర్గ సభ్యుల కారాగృహ నిత్య జీవిత విధానము మనకు దృగ్గోచరమగును. పట్టాభి కారాగృహమున బహుగ్రంథముల పఠించెను, రచించెను. అతఁడు బహు భాషలను నేర్చుకొనెను. మరియు 'గాంధి-గాంధీ తత్వ' మను గ్రంథమును రచించెను. మన పట్టాభి పత్రికాసంపాదకుఁడుగా ప్రసిద్ధి నొందియుండెను. తొలుత నతనికిఁ బత్రిక నడుపవలెనను సంకల్పము గలిగి "జన్మభూమి యను ఆంగ్ల పత్రికను స్థాపించి మాతృభూమిని సేవింపఁబూనుకొనెను. దాని సంపాదకీయ వ్యాఖ్యలు చదువునపుడు పట్టాభి సునిశిత విమర్శనపాటవము, నానావిషయ పరిజ్ఞానము చదువరులకు అచ్చెరువును గలిగించెను. ఆ పత్రిక, మాతృభూమియందేగాక దేశాంతరములందును, ఖండాంతరములందును ఆతని ప్రజ్ఞను వెలయింపఁ జేసినది.

## దేశసేవ

అంతటి ప్రజ్ఞాధురీణుఁడు ప్రజాహిత తత్పరుఁడు జాతీయవాది యెట్లుగాకుండును? 1910 నుండియు నాతఁడు జాతీయోద్యమములందుఁ బాల్గొనుచునే యుండెను, 1917 లో పట్టాభి వందేమాతరపుటుద్యమ సందర్భమున కీ. శే. ముట్నూరి కృష్ణారావు, కోపల్లె హనుమంతరావు, కౌతా శ్రీరామశాస్త్రి గార్లతోఁగలసి జాతీయోద్యమ ప్రచారము సాగించెను. వీరందఱు పత్రికల, ఉపన్యాసముల, హరి కథల మూలమున నాంధ్రలో సమధిక ప్రచారమునుసల్పిరి. హోమురూలుద్యమము నందును పట్టాభి అనిబిసెంటమ్మకుఁ గుడిభుజముగా

నుండి మిక్కిలి యుత్సాహముతోఁ బనిచేసెను. ఆమె పట్టాభి విజ్ఞానమును మెచ్చుకొని యాతఁడు నెలకొల్పిన జాతీయ సంఘమునకు ద్రవ్యసాహాయ్య మొనరించినది. ఆమె పట్టాభి రాజ్యాంగ పరిశీలన దక్షతను గొనియాడుచుండెడిది.

పట్టాభి వ సంవత్సరమున గాంధీమహాత్ముని సాహాయ్య నిరాకరణోద్యమమును బోధించిన నాఁటినుండియు మహాత్ముని యనుయాయియై, దేశసేవానిమగ్నుఁడై యుండెను. మహాత్ముని సత్యాహింసలయందు స్థిర విశ్వాసముంచి నడుమ నెన్ని యవాంతరములు వచ్చినను చలింపక పట్టాభి బాపూజిప్రేమకు పాత్రుఁడయ్యెను. కాంగ్రెసుపైకి తఱచు రేగు గాలి దుమారము లన్నింటిని శాంతముగా నెదుర్కొని పోద్రోలి యోరిమితో, అచంచల విశ్వాసముతో కాంగ్రెసునే సేవించుచున్న కేవల జాతీయ సేవకుఁడు మనపట్టాభి. కనుకనే మహా యోగిపుంగవుఁడు జాతిపిత యగు గాంధీమహాత్ముని దృష్టి నాకర్షించి అఖిలభారత దేశీయ మహాసభా కార్య నిర్వాహక వర్గము (వర్కింగు కమిటీ) నందు నాంధ్రులకుఁ బ్రాతినిధ్యము వహించి కాంగ్రెసుకు దేశ దేశాంతరముల సమధిక గౌరవము ప్రతిష్ఠింపఁ గలిగెను.

మహాత్ముని అసహాయోద్యమ శంఖారావమును ఆలించి బందరు పట్టణమున దేశభక్తుల సాహాయ్య సంపత్తుల నందుకొని జాతీయ కళాశాలను నెలకొల్పి నిర్విఘ్నముగ కొనసాగించిన నిర్మాణదక్షుండు పట్టాభి.

1930 వ సంవత్సరమున ఉప్పు సత్యాగ్రహము జరుపుటకు మున్ను గాంధీమహాత్ముడీ యాంధ్రుని హితమును స్వీకరించెను. పట్టాభి కార్యనిర్వాహక వర్గమున ప్రధానపాత్రను గైకొని సత్యాగ్రహపుతీర్మానము నెగ్గించెను. ఉప్పుశాసనమును ఉల్లంఘించి కార్యనిర్వాహకవర్గ సభ్యులతోపాటు కారాగృహమున కరిగెను. గాంధి-ఇర్విను సంధివలన విడుదలై మరల జాతీయ సేవాతత్పరుడై యుండెను. గాంధీజీ సూత్రప్రాయముగా వచించు నహింసాసిద్ధాంతమునకు, వ్యాఖ్యానము నొనర్పగల మేధావులు కాంగ్రెసు కార్యసమితియందు పట్టాభి, రాజగోపాలాచార్యు లిరువురే. దాక్షిణాత్యులందు గాంధీజీ దృష్టికి నచ్చిన నాయకులు వీరిద్దరే. పట్టాభికి పదవీ వ్యామోహము లేదు. కాంగ్రెసునందు శాసనసభాప్రవేశ విషయమున చీలికలు కలిగినపుడు పట్టాభి శాసనసభా ప్రవేశము కూడదనియే వాదించెను. అందువలననే యాతడెన్నడును శాసనసభాదుల కధ్యక్షత్వము నపేక్షించి యెఱుగడు. కాంగ్రెసు నందైనను పదవులకై ప్రాకులాడుట యాతనికిగిట్టదు. పట్టాభి 1939 లో గాంధీజీ ప్రోత్సాహమున జాతీయ మహాసభాధ్యక్ష పదవికి సుభాసు చంద్రబోసుతో బోటీచేసెను. కానికొలది వోట్ల భేదముతో నోడిపోయెను. పట్టాభికి ఓటమి సంభవించినపుడు గాంధీజీ యది తన యోటమియనియే ప్రకటించి పట్టాభిని గౌరవించెను. తరువాత జయపుర కాంగ్రెసు మహాసభకు పట్టాభి అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను. అఖిలభారతకాంగ్రెసధ్యక్షుడగు నాంధ్రుడీతడే.

ఆతని ప్రజాసేవ స్వదేశ సంస్థానములందును వెల్లివిరిసినది. పండితజవహరులాలు నెహ్రూ తరువాత పట్టాభి సంస్థాన ప్రజామండలికి "నవసారా" సమావేశము నందధ్యక్షత వహించి దక్షతతోఁదత్కార్యమును నిర్వహించెను. ఆతఁడధ్యక్షుఁడుగా నున్న కాలమునందు సంస్థానములందు సంచారముచేసి, సంస్థాన ప్రజల కష్టములఁబరిశీలించి, వారి హక్కులను రక్షించుటకై తీవ్రకృషి యొనర్చెను. వారియందు స్వాతంత్ర్య పిపాసను రగుల్కొల్పెను. ఆతఁడు చేసిన సేవను ప్రజామండలివారు వేనోళ్ళఁ గొనియాడిరి.

పట్టాభి మాతృభాష యందును ఆంగ్లమునందును ఉర్దూభాషయందును నిర్దుష్టముగా సహేతుకముగా మృదు మధురముగా, నుపన్యసింపఁగల వాగ్ధోరణిగలవాఁడు. ఆతఁడు తఱచు దేశీయ మహాసభా (కాంగ్రెసు) కార్యవర్గ సభలయందు హిందీలోను, ఉర్దూలోను జర్చించుచుండును. పట్టాభి వాగ్ధాటి కెంతటి యుపజ్ఞకలవాఁడును నెదుట నిలువఁజాలఁడు. ఆతఁడొకప్పుడు మోతీలాలు నెహ్రూవంటి న్యాయవాదితోఁ దలపడి తన యనర్గళ వాఙ్నైపుణీ ప్రభావమును వెలయించెను. కొందఱకు కలమాడిన నోరాడదు, నోరాడిన కలమాడదు. పట్టాభి అటులకాక ఉపన్యాసవేదికలందును, గ్రంథరచనమునందును బ్రసిద్ధివడసి రాజకీయ తారాపథమునఁ జంద్రబింబమై వెలింగెను.

కొంతకాల మాంధ్రరాష్ట్ర-ఆంధ్రప్రదేశ) కాంగ్రెసున కధ్యక్షుఁడై పట్టాభియు, కార్యదర్శియై గొట్టిపాటి బ్రహ్మయ్యయు

దేశసేవ యొనర్చిరి. ఆంధ్రరాష్ట్రోద్యమమునందు పట్టాభి యద్వితీయమైన కృషి నొనర్చెను. ప్రథమాంధ్ర మహాసభ, గుంటూరుజిల్లా బాపట్లయందు 1912 ఏప్రిలులో జరిగినది. నాఁటినుండియు ఆంధ్రులు రాష్ట్రసిద్ధికై పాటుపడిరి. పట్టాభి 1928 లో భాషాప్రయుక్త రాష్ట్రవిభజన సంఘమున కధ్యక్షుఁడుగా నుండి మన రాష్ట్రావతరణమునకు దోహద మొసంగెను. పట్టాభి భారత జాతీయ రాజ్యాంగ పరిషత్తునందు భాషాప్రయుక్త రాష్ట్రవిభజన తీర్మానమును బ్రతిపాదించి ప్రశంసాపాత్రముగాఁ గృషిచేసెను.

## పొదుపు

ప్రతి–ఆంధ్రుఁడు కాదు ప్రతి భారతీయుఁడు పట్టాభి యొద్ద నేర్చుకొనఁదగినది పొదుపరితనము. మొట్టమొదటి నుండియు నాతనికది సహజముగా నలవడినది. ఇతడు వార్తాపత్రికలందుగల ఖాళీస్థలములను వ్రాసికొనుటకుపయోగించును. 1942 ఆగష్టు ఉద్యమమున జైలునందున్నప్పుడు పట్టాభి వార్తాపత్రికలయందే వ్రాసి "కార్యనిర్వాహకవర్గమువారి కార్యకలాపము"లను గ్రంథమును దయారుచేసెను. బజారునుండి తెచ్చిన పొట్లములకుఁ జుట్టిన కాగితములను భద్రపఱచి అన్నము తిన్నపుడు చేతుల జిడ్డు తుడుచుకొనుట కుపయోగించును. తనకు వచ్చిన పోస్టుకవరులను విడదీసి బజారుబిల్లుల కుపయోగించును.

పట్టాభి ఒకసారి గాంధిగారి వద్దకు, చినుగఁగాఁగుట్టిన చొక్కాను ధరించి వెళ్ళగా గాంధీగారదియేమని ప్రశ్నించిరి.

పట్టాభి "అయ్యా! ఆంధ్రులు చినిగిన చొక్కాను పార వేయరు. కుట్టించుకొని మరల నుపయోగించుకొందు"రనెను. మఱల చినిగిన నేమిచేయుదురన, ఇల్లుఁదుడుచుట కుపయోగింతు రనియె. మహాత్ముఁడు పట్టాభిని ఆంధ్రులను గొనియాడెను.

కాంగ్రెసుచరిత్ర – ఉపోద్ఘాతములో రాజేంద్రప్రసాదు గారు ఇట్లు వ్రాసిరి. "కాంగ్రెసు సభావ్యవహారములను గూర్చియు, కాంగ్రెసు సభానుచరుల యనుభవ విశేషములను గూర్చియు ఈ గ్రంథకర్తకుగల విషయపరిజ్ఞానము అపారము. ఈ సభయొక్క యిటీవలి కథాకలాపమునందు ఈ గ్రంథకర్త కూడ ముఖ్యపాత్రధారిగా నుండెను. కనుక నిస్సారమైన గ్రంథస్థ పూర్వచరిత్రాంశములనుండి తన సారాంశములను క్రోడీకరించెడి రసావేశరహితుఁడైన చరిత్రకారుఁడీ గ్రంథకర్తకాఁడు. తాను స్వయముగా కనులార అనేక విషయములను చూచియుండెను. ఆ విషయములలో తాను గాఢసంబంధము కలవాఁడై ప్రవేశించి, ఒకప్పుడు సుముఖుఁడై మఱియొకప్పుడు విముఖుఁడై పలుమారు వ్యవహరించి యుండెను. ఇతఁడు సత్యమును గ్రహించుటయేగాక, గాఢమైన భక్తివిశ్వాసములతో ఈ గ్రంథమును రచించెను."

పట్టాభిగారు "గాంధి-గాంధీతత్వము" అను గ్రంథము రెండవ సంపుటములో విద్యను గురించి యిట్లు వ్రాసిరి. "సామాన్యజనులు మంచిబుద్ధిని, వివేకమును, ధైర్యమును, ఆత్మనిగ్రహమును సంపాదించి గొప్పవారుగ మెలగుటయే విద్యయొక్క యాశయము. పరీక్షా ఫలితములే ముఖ్యముగా చూడదగదు. పద్ధతులు మంచివిగా నుండవలెను. విద్యా

పద్ధతికి శీలము అలంకారము కావలెను. కంటకములేని దృక్పథము; ఉచితమైన భావము, ఉదార సంకల్పము కలిగించు నదిగా విద్య యుండవలయును, మన విద్యావిధానమును గుఱించి గాంధీజీ యాశయ మియ్యదియే. ఈ యాదర్శము కలిగియుండుటవలననే మహాత్మునకును వారి యనుచరులకును కీర్తి కలిగినది. మానవుని గొప్పతనమును పరీక్షించుటకు వాని జీవనవిధానము స్వార్థపూరితమా? లేక పరార్థ పూరితమా ? యని తెలిసికొనవలయును. విద్యను స్వార్థమునకు వినియోగించుకొనరాదు. దానిని ప్రజాసేవకే వినియోగించవలయును, ప్రజాసేవకు వినియోగపడు విద్యయే ఉత్తమవిద్య"

పట్టాభిగారు తమ కాంగ్రెసు చరిత్ర నంకితముచేయు సందర్భమున "మాతృదేశ విమోచనార్థము పరమోత్సాహముతో మహాత్యాగమును చేసిన అసంఖ్యాకులైన భారత కుమారీకుమారులు, ఏ సేవావ్రతమును ననుష్ఠించిరో; కాంగ్రెసు యోగములకు ఏ పరమార్థము, అవతరించిన సాధనమైనదో; అట్టి సత్యమునకు, అహింసకు సమర్పితము" అని వ్రాసిరి.

పట్టాభిగారు కొంతకాలము మధ్యప్రదేశ్-గవర్నరుగా నుండిరి. ఆంధ్రప్రదేశ్ రాజధానియగు హైదరాబాదునందు పటాభిగారు 17-12-1959 గురువారము పగలు 9-15 గంటలకు దివంగతులైరి.

ఆంధ్రనాయక మణులలో పట్టాభి చింతామణి వంటివాడని గాంధీ మహాత్ముండు నుడివెను.



అరదముపయి జయపురమున
సురవిభు విభవమునఁ జెలఁగి సుకుచిరవాణి
విరచనమున జయముగనె
భరతోర్వీనాయకుండు పట్టాభి కదున్.

అతఁడు వేదిక నెక్కెనా? వాగ్ఝరీ రస
మ్మున సభాసదులను ముంచియెత్తు,
అతఁడు వాదనఁ బూనెనా? ప్రతిపక్ష ప
క్షమ్ము నెల్లను జీల్చి వమ్ము సేయు,
అతఁడు కలము పట్టెనా? సార నవరస
కావ్యసంపుటుల లోకముల నింపు,
అతఁడు యోచనఁ జేసెనా? ఎంతవాని
గూడ వింతగను లోఁగొనఁగ గలుగు,

అతఁడు కాంగ్రెసు విశ్వవిద్యాలయమ్ము
భాష్యకారుఁడు గాంధిజీ ప్రవచనముల
కచల దీక్షితుఁ డర్థశాస్త్రాభివేత్త
ఘనుఁడు పట్టాభి ఆంధ్రుల కలిమిబలిమి.

గాంధి వచించు బుక్కలకు కమ్మని భాష్యములన్ రచింపగా
సంధినొనర్చువేళ కడు చక్కని యుక్తుల షేళవింపగా,
అంధతబాప భారతమునంతట జ్ఞానసుధాంజనంబు నీ
యం ధిషణాచమత్కృతి నహో! సము డెవ్వడు భోగరాజుకున్?

అతఁడు మహారథుండు భరతావని దాస్యవిమోచన క్రియా
శ్రిత ఘన శాంతి సంగర విదీర్ణ విదేశ దురాగతుండు, సం
తత నిజవాక్ప్రయుక్త సముదాయ వినిర్జిత శత్రుపక్షుఁ డం
చిత సుగుణప్రభాఖ్యుఁడు విశేష యశోవిభవాత్ముఁ డిమ్మహిన్.

—"జయభేరి" ఖండకావ్యసంపుటినుండి.

పట్టన్ బగ్గములేని చందమున సప్తద్వీపమహా భూమికిన్
బట్టాదారుల మేమటంచు నజువల్ ప్రత్యర్థులై జాతికిన్
రట్టుల్ దెచ్చు తఱిన్ ద్రివిక్రముఁడవై అంపిల్లి మాఱొడ్డితో
పట్టాభీ! జయలక్ష్మి తావకభుజాబంధంబు మన్నించుతన్ ॥

పసువుంబాసిన జీవితంబిఁక సహింపంజాల మంతంతకున్
బసవాచున్నవి తల్లి కష్టముల నల్పస్థైర్య రేఖాసము
ద్ధుర తేజంబున వార్ధులింకిన గిరిస్తోమంబులుఱ్ఱూఁగినన్
బరమేశుం డదలించినన్ నిలువకీ ప్రస్థానసంరంభముల్॥

ఎవఁ డే మూలుగు మూల్గినన్ దెలుఁగునాఁడీనాఁడు సోత్సాహమై
భవదాజ్ఞావశవర్తియై యశము సంపాదింప నుంకించెడిన్
అవిగో పింజలుపింజలై విరిసె నీర్ష్యామేఘపుంజంబు లి
య్యవిగో నీకు ననర్ఘ్యరత్నకుసుమ వ్యాకోశముల్ దోసిళుల్॥

—రాష్ట్రగానము.

ఎవ్వనికొల్వు భద్రములకెల్ల నిదాన, ముదారతామయుం
డెవ్వఁడు సర్వలోకముల నేలు మహఃపరిపూర్ణమూర్తియై
నెవ్వఁడు వాఙ్మనఃక్రియల కేర్పడరాని మహాత్ముఁ డాద్యుఁడై
యెవ్వఁ డసంగు, సత్యమన నెవ్వఁడు వానిభజింతు నిచ్చలున్ ॥

వీరుల్ త్యాగులు దేశభక్తులు జగద్విఖ్యాత కీర్తి ప్రభా
శ్రీరోచిష్ణులు బుద్ధ శంకర శివాజీ గాంధి గంగాధరా
న్సారీ ముఖ్యులు పుత్రులే జననికిన్ జన్మించి రగ్గౌరవా
ధారన్ భారతమాత నెంతుఁ జరితార్థత్వంబు నర్థించుచున్ ॥

భారతంబును బల్కు పనిఁబూని తిక్కన్న
పసిఁడి గంటము కేలఁ బట్టునాఁడు
వేద భాష్యముఁ జెప్ప వేడ్క విద్యారణ్యుఁ
డోంకారమును వ్రాయుచున్ననాఁడు
దిగ్జయాపేక్ష సంధిల్ల రాయలు విజృం
భించి దుందుభి మ్రోయించు నాఁడు
సంఘ సంస్కరణ దీక్షా కంకణంబును
రెడ్డి వేమన్న ధరించునాఁడు

వారల కొసంగినట్టి దీవనల నిచ్చి
వారలం గన్నకంటు నింపారఁ గాంచి
యాదరింపఁ గదమ్మ నిన్నాశ్రయించి
యంజలి ఘటించుచున్నాఁడ నాంధ్రజనని!

—తుమ్మలవారి "బాపూజీ ఆత్మకథ" నుండి.

# సీతారామమూర్తి

శ్రీ సీతారామమూర్తిగారు గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా కావూరు గ్రామములో తుమ్మల చెంచమ్మ నారయ్య అను పుణ్యదంపతులకు 25-12-1901 జన్మించినారు. అయిదు సంవత్సరముల బాల్యము ననుభవించి 1906 నవంబరులో ప్రాథమిక పాఠశాలలో చేరిరి. బ్రహ్మశ్రీ కావూరు శ్రీరాములుగారు అచటి గురువులు. ఆయన చదువులోనేకాక సౌజన్యమునందును పేరుగలవారు. ఆయన శిక్షలో అయిదు సంవత్సరములున్నారు మన కవిగారు. వాచకాల చదువే అచట ప్రధానము. కాని కవిగారికి వారి తండ్రిగారి కోరికపై శ్రీరాములుగారు ప్రత్యేకముగా ఇరువది, ముప్పది శతకాలు భారతములోని నలచరిత్ర, భాగవతములోని ప్రహ్లాదచరిత్ర, రుక్మిణీకళ్యాణము, గజేంద్రమోక్షము, కుచేలోపాఖ్యానము బోధించిరి. అమరము కొంత, ఆంధ్రనిఘంటుత్రయము వల్లింపించిరి. ఏపద్యమైనను మన కవిగారు రెండుసార్లు చదివి ఆనాడప్పగించువారు. వీరి తండ్రి నారయ్యగారు దైవభక్తి, ధర్మానురక్తి మున్నగు సుగుణములు మూర్తీభవించిన పుణ్యపురుషులు. ఈయనచరిత్రలో నొకభాగమే మన కవిగారు రచించిన ధర్మజ్యోతి. ఈయనకు చదువురాదు. అక్షరములేరావు. కాని నిత్యము పురాణశ్రవణముచేయుచు జ్ఞానము, పాండిత్యము సంపాదించి ఇతరులు చదువుచుండగా తాను భారతాదుల



అభినవతిక్కన
శ్రీ తుమ్మల సీతారామమూర్తి

కర్థము చెప్పుచు పెద్ద పౌరాణికుడుగా నుండెడివారు. ఈ విషయములో నిట్లు కవిగారు వర్ణించిరి.

"చదువరి గాకున్న నేమి బుధసత్తము లుబ్బగ నర్థభావసం
పద వికసింప భాగవత భారతముల్ వివరించు; హృద్యముల్
ఘనుల కావ్య పద్యములు ధారణకగ్గముచేసి వేనవేల్
ఘనునవతింటను తచ్ఛ్రీకణసాహితి దుశ్శక మెట్టివారికిన్"

కవిగారు ప్రాథమిక పాఠశాలలో చదువు కాలమున తండ్రి వీరిచే రాత్రిపూట భాగవతాదులు చదివించుచు తాను శ్రోతలకు అర్థము వివరించుచు తన యిల్లొక పురాణగోష్ఠిగా చేయువారు. ఇచటనే కవిగారికి సాహిత్యవాసన అంటినది. 1911 లో మన కవిగారు ప్రాథమిక పాఠశాలలో నున్న కాలమున కావూరు ప్రక్కగల చెరుకుపల్లిలో సుప్రసిద్ధులగు కొటెంపూడి రాజనన్నారుకవిగారు అవధానముచేసిరి. ఆ సభకు మన కవిగారు వెళ్ళిరి. ఆనాటి సమస్యలలో "శునకమ్ము మ్రింగెను విష్ణుదేవు మహహా! చోద్యంబుగా నత్తఱిన్" అనునది ఒకటి. అవధానిగారు త్రిపురాసుర సంహారకథకు దీనిని సంధించి "ఈ శునకమ్ము మ్రింగెను...." అని చక్కగా పూరించిరి. ఈ అనుభవముతో చౌదరిగారు బడికివచ్చి తోటి విద్యార్థులను గూర్చుండబెట్టి ఈ సమస్యనే వివిధముగా పూరించి పద్యమును బూర్తి చేసిరి ఆనాడే వీరికి కవితావాసన అంటినది.

సీతారామమూర్తిగారికి 1911 లో ప్రాథమికవిద్య ముగిసినది. తర్వాత ఏమి చేయవలయునను విచారము కలిగినది తండ్రిగారికి. తెనాలి తాలూకా పెదపూడిలోనున్న తన యల్లుడు శ్రీజాస్తి సుబ్బయ్యగారికి విద్య నప్పగించినారు. ఆ సుబ్బయ్య

గారు గట్టి సాహిత్యముగల పౌరాణికుడు. వేదాంత విద్యలో దిట్ట. సత్ప్రవర్తనకు పెట్టిన పేరు. వారినిగురించి కవిగారిట్లు వ్రాసిరి.

"ఈ విధి నాంధ్రవాణి భజియింపఁగ నాకు నెవండు నుండగన్
ద్రోవలనెల్లఁ జూపి కడుఁగోడ్పడె నగ్గురువర్యు సాహితీ
సేవధిఁదత్త్వవిన్నికరశేఖరు భూరియశోవిభాసి మా
బావనుగొల్తు జాస్తికులపావనుఁ జల్లయసుబ్బయాఖ్యునిన్."

ఆయన శిక్షలో మన కవిగారు ఒక సంవత్సరముండిరి. అపుడు అమరము పూర్తి చేసిరి. మనుచరిత్ర, వసుచరిత్రచదివిరి. సాహిత్యము గట్టిపడసాగినది. అప్పటికి కవిగారి వయస్సు 11 సంవత్సరములు. పెదపూడినుండి యింటికివచ్చి వ్యవసాయపు పనులలో తండ్రికి చేదోడుగా నుండవలసివచ్చెను. వీరి మనస్సులో మాత్రము విద్యాసక్తి మెండగుచుండెను. తీరిక చిక్కినప్పుడెల్ల భారతము చదువుకొనువారు. కవిత్వము వ్రాసెడివారు. 1911–18 మధ్య 5, 6 శతకములు, 4 హరికథలు, 2 నాటకములు, 1 జంగంకథ, 1 ప్రబంధము వ్రాసిరి. ఆ పుస్తకములు తృప్తికరములు గాక అణగిపోయినవి. వ్రాత ప్రతులు లేక పోలేదు. ఇవి యన్నియు పౌరాణికములు.

కవిగారికి సంస్కృతము చదువవలయునను కోర్కె బలముగా కలిగినది. ఊరిలో చెప్పువారు లేరు. గ్రామాంతరము వెళ్ళినచో భోజనాదు లెట్లు? ఆ ఖర్చుల భరించుటకు తండ్రిగారు జంకిరి. వారములు చేసికొనియైన చదువవలయునని కవిగారు సంకల్పించుకొనిరి, తండ్రితో చెప్పకుండ అంగలూరు వెళ్ళి 1917 లో సంస్కృత పండితులైన (శ్రీ) దుగ్గిరాల పురుషోత్తం గారి నాశ్రయించిరి. వారు ఆదరించిరి. వారింటిలో తినుచు

నాల్గుదినము లటనుండిరి. వారములకుగుట చేతగాక మార్గాంతరము లేక 5 రోజులకు ఇంటికి తిరిగివచ్చిరి. ఆ సంవత్సరమే తండ్రి స్వర్గస్థుడయ్యెను. కవిగారికి వ్యవసాయభార మెక్కువయినది. విద్యాతృష్ణయు హెచ్చే అయినది. తనకు 4 మైళ్ళ దూరములో నున్న 'చందవోలు'లో మహాపండితులు, మహాకవులగు తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రిగారుండిరి. వారియొద్ద చదువుటకు మన కవిగారు నిశ్చయించుకొనిరి. తీరికయేదీ? పగలంతయు పొలములో పనిచేసి, రాత్రి పెందలకడ భోజనము చేసి చందవోలు వెళ్ళువారు. పాఠము చెప్పించుకొని నిద్రించి తెల్లవారకముందే యిల్లుచేరి కోతకో కుప్పకో సిద్ధమయ్యెడివారు. (శ్రీ) శాస్త్రులుగారి శిక్షలో ఒక వర్షము చదివినారు. కాళిదాసత్రయము పూర్తి జేసినారు. శాస్త్రులుగారి శిక్ష చాల గొప్పది. కాబట్టి కవిగారు మంచి సాహిత్యము సంపాదించిరి. ఈ గురువుగారినిగూర్చి వీరిట్లనిరి.

"ఏకశ్లోక రహస్యబోధనముచే నెవ్వాడు శిష్యున్ సుధీ
లోకాగ్రేసరుఁజేయు నవ్విబుధుఁ గొల్తున్ వేంకటప్పార్యు న
స్తోక శ్లోకమయూఖరాజదఖిలాశున్ శాస్త్రగాథా కృతా
ఖ్యాకగ్రంథమతల్లికాజనకు మద్గైర్వాణభాషాగురున్."

చందవోలు చదువుసాగక కవిగారు దిగులుపడుచుండ 1918లో కావూరున సీతారామాంధ్ర గ్రంథాలయము ఏర్పడినది. దాని స్థాపకులలో కవిగారు ఒకరు. పైగా భాండాగారికులు. రైతులకు తీరికగా నుండు సమయమున నిత్యము గ్రంథాలయము తెరచుచు అందలి పుస్తకము లన్నియు చదువుచు తమ సాహిత్యమును కవిగారు వృద్ధిచేసికొనిరి.

ఇంతలో 1920 లో అసహాయోద్యమము వచ్చినది, కవిగారి జీవితము దాని కంకితమైనది. వారు గ్రామ కాంగ్రెసు సంఘమునకు 'కార్యదర్శి' అయిరి. ఫిర్కాలోని కాంగ్రెసు ప్రచారకులలో వీరే ఆనాడు ప్రధానులు. 1920 నుండి 29 వఱకు కవిగారు కేవలము కాంగ్రెసు సేవకులు. గుంటూరుజిల్లా కాంగ్రెసు సంఘములో ఆ పది సంవత్సరములు వారు సభ్యులే. 1922 పన్నుల నిరాకరణములో జరిమానా శిక్షకూడ పొందిరి. 1924 నుండి 29 వరకు తమ గ్రామములోని తిలక్ జాతీయ పాఠశాలలో ఉపాధ్యాయులును.

## రచనలు

1920 నుండి కాంగ్రెసు ప్రచారమున కుపయోగించు ఖండికలను పెక్కింటిని వ్రాసిరి. తిలక్ నిర్యాణముపై వ్రాసిన పద్యములు ఈ శాఖలో మొదటివి. రాట్నము, ఖద్దరు, గాంధి, అస్పృశ్యత, పంజాబువధలు, దాసు, ఆంధ్రరత్నము, ఓట్లు, భారతమాత, మున్నగు పలుశీర్షికలతో ఈ శాఖ ప్రారంభమై రానురాను కవిగారిని జాతీయకవిని చేసినది.

జాతీయ పాఠశాలలో పనిచేయుచు 1925లో "ఉభయ భాషాప్రవీణ" పరీక్షకు ప్రయత్నములు సాగించిరి. 1930 లో అందు మొదటి తరగతిలో ఉత్తీర్ణులైరి. ఈ పరీక్షకొఱకు 1929 లో చిట్టిగూడూరు (పర్ణశాల) లో నుండి బ్రహ్మశ్రీ దువ్వూరి వెంకటరమణ శాస్త్రిగారియొద్ద వ్యాకరణశాస్త్రము చదివిరి. వారినిగూర్చి ఆత్మకథలో నిట్లు వ్రాసిరి.

"శబ్దశాస్త్రాదిలక్షణ సంప్రదాయ
మెవ్వఁడెఱిఁగించె నాకు నయ్యుద్ధచరితుఁ
బ్రస్తుతించెదఁ బుంభావపద్మజాత
రమణి దువ్వూరి వేంకటరమణశాస్త్రి"

1919-30 మధ్య వీరు సాగించిన కవితలో ఒకశాఖ పౌరాణికము, మరియొకశాఖ జాతీయము. పౌరాణికశాఖలో రాము శతకము, రామలింగేశ్వర శతకము, నామదేవ చరిత్ర (హరికథ), మహేంద్ర జననము (నాటకము) మున్నగునవి చేరును. జాతీయశాఖలో గాంధీతారావళి మున్నగు ఖండికలు, ఆత్మార్పణ కావ్యము చేరును.

కవిగారు 1930 లో విశ్వవిద్యాలయ పట్టము సంపాదించిన తరువాత గుంటూరు జిల్లాబోర్డులో పండితులైనారు. దుగ్గిరాల, బాపట్ల, నిడుబ్రోలు, అప్పికట్ల హైస్కూళ్ళలో పనిచేసి ప్రస్తుతము అప్పికట్లలో నివసించుచున్నారు.

1932 లో వీరు తమ దైవమగు గాంధీమహాత్ముని ఆత్మకథను పద్యకావ్యముగా వ్రాయ నారంభించిరి. 1935లో ఒక భాగము పూర్తిచేసి దానిని 1936 లో ప్రకటించిరి. అది భారతప్రతిబింబమని (శ్రీ) రామలింగారెడ్డినంటివారు శ్లాఘించుట, రెండుమూడు విశ్వవిద్యాలయములలో పాఠ్యమగుట అది కారణముగ వీరికి 'అభినవతిక్కన' బిరుదమువచ్చుట లోకమెఱుంగనిదికాదు.

1937 లో రాజాజీ మంత్రివర్గము చెన్నరాష్ట్రమును పాలించునపుడు ఆంధ్రుల రాష్ట్రవాంఛ వెల్లివిరిసినది. విజయవాడలో ప్రత్యేకాంధ్రమహాసభ జరిగినది. కవిగారు ఆ సభను

జూచి ఆవేశము పొందిరి. దాని ఫలితముగా "రాష్ట్రగాన" మను మహోజ్జ్వల కావ్యము బయలువెడలినది. అద్దాని సౌందర్యము, సందేశము, ఉదాత్తత ఇపుడు వివరింప నవసరములేదు. ఆ బెజవాడసభకు ఆహ్వానసంఘాధ్యక్షులై తరువాత మహాసభకు ఉపాధ్యక్షులై ఆంధ్రోద్యమమును నడిపిన చల్లపల్లి ప్రభువులు శ్రీ యార్లగడ్డ శివరామప్రసాదు బహద్దరుగారి రాష్ట్రసేనకు మెచ్చి కవిగారీ కావ్యము వారికి నంకితము చేసినారు. 1938లో ప్రథమ ముద్రణ మందిన ఈ కావ్య మిపుడు 7వ కూర్పునకు సిద్ధముగా నున్నదన ఆశ్చర్యపడనక్కరలేదు. కవిగారికి వ్యాపారదృష్టి యున్నచో రాష్ట్రగానము ఇప్పటికి 6 కూర్పులుకాదు, 60 కూర్పులు పొందియుండెడిది.

1940 లో కవిగారు తమ తండ్రి పాలించిన ఉదాత్త ధర్మము నొకదానిని వర్ణించుచు 'ధర్మజ్యోతి' అను కావ్యమును రచించి 1942 లో ప్రచురించిరి. కవిగారి మిత్రులు దానయ్యగారు దీని కృతిపతులు. 1956 లో దీనికి మూడవ ముద్రణ జరిగినది. ఈ కావ్యరాజము ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారి ఇంటరు పరీక్షకు పాఠ్యగ్రంథముగా నైనది.

1948 లో తన వేలుపగు బాపూజీ నిర్యాణముతో కవిగారు కుంగిపోయిరి. ఆదుఃఖావేశములో, ఆ కాఱుచీకట్లలో వారు వెలిగించిన జ్యోతియే అమరజ్యోతి. ఇదియెంత చిన్న కావ్యమో అంత ఉత్తమకావ్యము దీనిలో కవిగారి కవితాతపస్సు పండినదని చెప్పుటలో సందేహాములేదు. "పూవుల తెప్పపైగదలిపోయితివా" ఇత్యాది పద్యములు పాడుకొనుచు తెలుగు బిడ్డలందఱు నేడీ కావ్యమును సేవించుచున్నారు.

"నందలు వేలు పొత్తములు వ్రాయుచు నాయువు చేసినంత నే
పందెము గెల్చినా కవికి బాలకలోకపు ముద్ర లేనిచో? "

తన కీ శరీరమిచ్చిన తల్లి చెంచమ్మగారి ఋణము తీర్చుటకై కవిగారీ కృతిని ఆమెకు పూజాపుష్పముగా సమర్పించుకొని ధన్యులైనారు.

శ్రీ చౌదరిగారు ఆత్మకథాది కావ్యములేగాక 1920 నుండి అనేక ఖండకావ్యములు కూడ వ్రాసిరి. అవి ఎప్పటికప్పుడు సుప్రసిద్ధములైన " భారతి " మున్నగు పత్రికలలో వెలువడుచు వచ్చినవి. ఏదో ఒక ధార్మికావేశము, నైతిక ప్రేరణ లేనిచో మనకవిగారు కవిత్వము జోలికి పోరు. ఆ గుణములు వీరి ఖండకావ్యములలో విశేషించి కన్పడుచుండును. వీనిని గాలికి పోనీయకుండ ఒక ఆకృతికిఁ దెచ్చుట సారస్వతమునకు లాభకారియని తలచి 1942 లో " పఱిగపంట " యను పేరుతో, 1948 లో " పెద్దకాపు " అను పేరుతో తమ ఖండకావ్యములను సంపుటీకరించిరి.

తమ సారస్వత క్షేత్రములో పఱిగకంకులవలె చెదరి చెదరియున్న కవిత్వమును ఒక చోటికిచేర్చి పంటపండించిరి. కావున ఒకసంపుటము "పఱిగపంట" అయినది. గ్రామ్యభాషా దూషితమై ఉదాత్త వస్తుశూన్యమై నేడు వెలువడుచున్న వెఱ్ఱికవిత్వాలనుజూచి "నాకుదిక్కులేదా?" యనివాపోవుచున్న ఆంధ్రికి నేలిరకుగ లేదా మంచి పంటగ జేసినారు కాబట్టి రెండవది "పెద్దకాపు" అను పేరుతాల్చినది.

వీనిలో పఱిగపంటను నిడుబ్రోలు హైస్కూలునకు తనకున్న సంపదనెల్ల నర్పించిన కర్మయోగి శ్రీ కొసరాజు

లక్ష్మయ్యగారికి కానుకగానొసంగిరి. పెద్దకావ్యమును మహాత్ముని ప్రియశిష్యులు, దండి సత్యాగ్రహయోధులు, సేవావ్రతులు నగు శ్రీ ఎర్నేని సుబ్రహ్మణ్యముగారికి నుఘగర గావించిరి.

కవిగారు తమ కావ్యములను అంకితము చేయుటలో ఆదర్శప్రాయమైన మార్గము త్రొక్కినారు. వీరి కావ్యము ముద్రితమై వచ్చువఱకు అది ఎవరికి సమర్పింపబడినదో లోకమునకు తెలియదు. అసలా కృతిపతికే తెలియదు. ఆకృతిపతి ధనవంతుడు కానక్కఱలేదు. దేశారాధకుడు, సేవాజీవి, సజ్జనుడు అయిన చాలును. ఈ సంధర్భములో—

"కృతమెఱుకచాలు నస్మ
న్మతికింపద కబ్బమిచ్చి మణిగొంట జగ
ద్ధితశీలుండోదవ సదా
చితమ్ముగా నిడుదు నా సృజించిన కవితన్"

"నరునకుఁ గబ్బమిచ్చుట యనాదృత కృత్యమటంచు సత్కవీ
శ్వరులు పురాతనుల్ నుడువుచంద మదేమొ రచింప జింతయున్
సిరులకు నాసచెంది యొకచెన్నఁటి కిచ్చుట మచ్చగాని స్వా
ర్థరహితబుద్ధి నిద్ధగుణరాశి కొసంగిన దోసమున్నదా?"

అను కవిగారిపల్కులు సత్కవులకు శిరోధార్యములు. ఇటువంటి కవులు కవిత్వమువల్ల ఏమి సంపాదింపగలరు? సంపాదింపవలయుననెడి కోరికయు ఈయనకులేదు. పోనీ ఈయన సంపన్నుడా? కాదు. విలక్షణమైన ప్రకృతి. ఈ ప్రకృతి ఎచటి నుండి వచ్చినది? ఏ ప్రకృతియైనను నిష్కారణముగా ఊడి పడునా? తుద మొదలు లేని లేమిడిలో మునిగియున్నాడు, చెలికాడు తనదగ్గఱ దాచిన పదిహేసెల బంగారము కాచికాచి "ఇందులో కొంత నీవు పుచ్చుకొనుము బాబూ?" అని ఆమిత్రుడెంత ప్రార్థించినను "నీ సొమ్ము నాకేల" యని

తిరస్కరించిన నారయ్య కొడుకుగాడా మనకవి? కావుననే "మాకున్ మా సంతతికిని ధర్మవ్యాసక్తియు సిరులకంటె నగ్రియ మగుతన్" అని చెప్పగలిగినాడు.

మన కవిగారు చక్కని కవిత్వము చెప్పగలరని తెనుగు వారందరు ఎఱుంగుదురు. కాని ఆయన అవధాని యని, ఆశు కవి యని ఎంతమందికి తెలియును?

తెలియునట్లు ఈరంగములో ఆయన విజృంభించలేదు. కాని ఇరువది ముప్పది అవధానములుచేసి జయప్రదముగ నిర్వహించినారు. అవధానములలో ఆశుకవిత్వముగూడ అనివార్యముగదా! అయినచో అప్పటి మన కవిగారి ఆశువెట్లున్నదో చూతురా?

"ఈ గోడ యిసుక సున్నము
యోగించిన వస్తువంచు యోజింపకుడీ
ప్రేగులు మూఁగడి యానదల
మ్రైఁగల రుధిరాస్థు లిట్లు మనకుం దోఁచున్."

అత్యద్భుతధారణాశక్తిగల వీరి కవధానము లేమిలెక్క? ఆధారణచే వీరు తన పద్యములుగాని, ప్రాచీన కవుల పద్యములుగాని వేలకువేలు ఈనాడప్పగించగలరు.

ప్రత్యేకముగ అయిదారు సభలలో మన కవిగారు ఆశుకవిత్వము నడిపిరి. 1947 లో శ్రీ భావనారాయణస్వామి వారి కళ్యాణోత్సవ సమయమున పొన్నూరులో జరిగిన సభలో గంటకు 120 పద్యములు చొప్పున రెండుగంటలపాటు కవితావర్షము కురిసిరి. ఆకవిత్వము వారి కావ్యకవిత్వమునకు ఏమాత్రము తీసిపోని బింకముతో పవిత్రతతో సాగినదనుటకు ఆనాటి సదస్యులగు పండితకవులే సాక్షులు.

కవిగారు 1954 లో "ఉదయగానము" అను మరియొక కావ్యమును వ్రాసిరి. " తెలుఁగునాటి యభ్యుదయము పట్లఁ దెలుఁగువారికెల్లరకు నాదరానురాగములుంట సాజము. అది ధర్మముకూడను. నేనీధర్మమును గవితారూపమునఁ బాలింపఁ జూచితిని. రాష్ట్రసిద్ధికై పరితపించుచునానాఁడు రాష్ట్రగానము నాలాపించితిని. రాష్ట్రవృద్ధికై యభిలాషించుచు నీనాఁడీయుదయగానమును బాడితిని".

" మహావీర పొట్టి శ్రీరాములుగారి బలిదానముతో రాష్ట్రోదయమైనది. దీనితో నుదయగానమును సాగినది. కావున నాటినుండి మొన్న మొన్నటి (౨౯-౧౦-౫౪) దనుక మనగడ్డలోఁ దలయెత్తిన రాష్ట్రీయ సమస్యలు కొన్నింటి యూహాగానములింపుఁ దడవితిని. దేశవికాసమునకై నాకుఁదోచిన సూచనలును గావించితిని. మన రాష్ట్రము భాషామూలక మగుటం దెనుఁగు బాస పెంపు సొంపులఁగూర్చియు నింపుఁ జర్చించితిని. ఈ కృతి రాష్ట్ర గానమునకుఁ జెలియలు. అక్కగారికి దక్కినకీర్తి యీమెకునుదక్కునుగాక." అనిఅందలి ఎఱుకలో కవిగారు తమ రచనోద్దేశమును వివరించిరి. 1955న కవిగారి "శబల"అను ఖండకావ్యసంపుటి 1959న గీతాంగణము ముద్రితములు. గీతాంగణము డాక్టరు శ్రీ వెంపటి సూర్య నారాయణగారికి అంకితము. అందలి పద్యము.

పై చూపు వలచు ప్రాణికి
లోచూపును సైత మొసఁగి లోకస్థితికిన్
నోఁచిన చికిత్సకమణీ !
శోచఘని ! సామ్యయోగి సాహిత్య ధునీ !

సర్వోదయగానము, తెనుఁగునీతి అనుకవిగారి రచనలు ముద్రితములగుచున్నవి.

# సన్మానములు

ప్రజాభ్యుదయమునకు ఉపయోగించు కవిత్వము వ్రాయు వారికి లోక మెప్పుడును జోహారు లిచ్చుచుండును. కావుననే ఈ అభినవతిక్కనగారికి 1939 లో నెల్లూరు వర్ధమాన సమాజమువారు శ్రీ రామలింగారెడ్డిగారి యాజమాన్యమున సమావిష్టమైన పేరోలగములో శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు తిక్కన పేరుతో నొసంగు బహుమానమును సమర్పించి సత్కరించిరి. 1942 లో గుంటూరుజిల్లా అప్పికట్ల పరగణావారు, శ్రీజాగర్లమూడి కుప్పుస్వామి చౌదరిగారు అధ్యక్షతవహించిన మహాసభలో వీరికవితాసేవను కొనియాడి గౌరవించిరి. ఈ సందర్భమున వారు వెలువరించిన "అభినవ తిక్కన సన్మాన సంచిక" కవిగారి సౌజన్యమును, కవితా ప్రశస్తిని వేనోళ్ళ చాటుచున్నది. మరియు 1944లో ముక్త్యాల ప్రభువులు వీరిని ఆహ్వానించి శ్రీవెంపటి పురుషోత్తం, ఎం. ఏ, గారి పెద్దరికముతో నేర్పడిన సభలో ఉదాత్తరీతిని సన్మానించిరి. ఆవెంటనే నవ్యసాహిత్య పరిషదాహ్వానసంఘమువారు శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారి అధ్వర్యమున తెనాలిలో జరిగిన మహాసభలో అసంఖ్యాక విద్వత్ కవిబృందముల్ర మోల మనకవిగారి సాహితీశక్తిని కొనియాడి గౌరవించిరి. అనంతరము 1948 లో కృష్ణామండలమందలి "ముదునూరు" పౌరులు వీరిని ఆహ్వానించి సంభావించిరి.

ఇట్టి మెచ్చుపిలుపులు ఎన్నో వచ్చుచున్నను కవిగారి ఆరోగ్యము దుర్బలమైన దగుటచే వానినన్నింటిని పాటింపలేక పోవుచున్నారు.

అది బలిష్ఠమే యైనచో వీరు ఇంక నెన్ని కావ్యములు సృష్టించియుండెడివారో? అయినను కవిగారెట్లో ఓపికచేసికొని గాంధీమహాత్ముని ఆత్మకథను పద్యకావ్యముగా వ్రాసిరి. నాలుగు వేల పద్యములతో ముద్రితమై ఆ మహాకావ్యము ఆంధ్రదేశ మందంతట ఆదరింపబడుచున్నది. కృతిభర్త శ్రీ సాధు సుబ్రహ్మణ్యముగారు.

"ఇతడు నా యమూల్య సంపద, ఇతడు నా గౌరవ పతాక" అని తెలుగుజాతి, తెలుగుబాస సగర్వముగా చెప్పుకోదగిన యీ జాతీయకవిని, ఈ సాధుశీలుని విశాలాంధ్రములోని ప్రజ లందఱు 29-1-1949 లో నిడుబ్రోలునందు కనకాభిషేకము, గండపెండెరము, గజారోహణ మహోత్సవము మున్నగు ఉదాత్త సత్కారములతో నర్చించి తమ కర్తవ్యమును జేగీయ మానముగా నిర్వహించి ధన్యులైరి. ఈ సన్మాన సభకు ఆంధ్ర విశ్వకళాపరిష దుపాధ్యక్షులు, విమర్శ చక్రవర్తులు, కవితా విశారదులు నగు డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగా రధ్య క్షులుగా నుండుట, అందు కవిగారికి "సువర్ణాంజలి", "మాతృ హృదయము" అనుకావ్యములు వారిశిష్యులు సమర్పణచేయుట కడుంగడు ప్రశంసనీయము.

13-1-57 న గుడివాడ "ఆంధ్రనలంద" అభినవతిక్కన గారిని సన్మానించినది. ఆసమయమున పురపాలక సంఘము వీరికి సన్మాన పత్రమొసఁగినది.

2-10-57 గాంధి మహాత్ముని జయంతి దినమున కవి గారి జన్మస్థానమగు కావూరు గ్రామమున పౌరులు, వినయాశ్రి

మహాసులు స్వయముగా వడికి నేయించిన ఖద్దరు వస్త్రములతో కవిగారికి తులాభారము తూచి, ఆ వస్త్రములను కవిగారిచే పేదలకు పంచిపెట్టించిరి. కవిగారి ఉద్యోగవిరమణ సందర్భమును పురస్కరించుకొని అప్పికట్లవారలు 5–3–58 న కవిగారిని ఘనముగా సన్మానించిరి. కవిగారి జయంతి సభలు పలు తావులందు జరుపబడుచున్నవి. సీతారామమూర్తి కవిగారికి ఇటీవల విద్వాన్ వేదము వేంకటకృష్ణ శర్మగారు తమ "నెహ్రూ"చరిత్ర పద్యకావ్యమునంకితము చేసిరి. 1958ఆగష్టున కళ్యాణదుర్గమందు కవిగారికొక గొప్పసన్మానము జరిగినది.

కవిగారు ప్రకృతము "మహాత్మకథ" యను కావ్యమును వ్రాయుచున్నారు. ఇందు ఆత్మకథలో లేని బాపూజీ చరిత్ర వర్ణింపబడుచున్నది. ఆత్మకథలో 1920 వఱకు నడచిన బాపూజీచరిత్రమే కలదు. మహాత్మకథతో గాంధీమహాత్ముని కథ పూర్తియగును.

"ఆంధ్ర కవితాలతాంగి ముత్యాలశాలఁ
గొలువుదీరిన యీ పెండ్లికొడుకు వీఁడఁ
జల్లుచున్నారు పన్నీటిజల్లుతోడ
రసజగన్నాయకులు మెచ్చి పసిఁడిపూలు"

—:0:—

# జన్మదినోత్సవము

ఈ కవి హృదయముతోబాటు కవిత్వమును పరిపక్వదశకు దెచ్చుకొనిన జాను తెనుగుకవి. సమాజములో వచ్చు మార్పులను కవితలో ప్రతిబింబింపజేయు మహాకవి. విశ్వమానవాభ్యుదయమును కాంక్షించి రచన సాగించిన తెనుగులెంక. తెనుగు జానపద రామణీయకమును తేనె పలుకులతో జాలువార్చిన మహాశిల్పి శ్రీ సీతారామమూర్తి.

సంస్కృతమున రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, కిరాతార్జునీయము (భారవి), శిశుపాలవధ (మాఘుము) అనునవి పంచకావ్యములు. ఆంధ్రమున మనుచరిత్ర, వసుచరిత్ర ఆముక్తమాల్యద, పాండురంగ మహాత్మ్యము, పారిజాతాపహరణము. అనునవి పంచకావ్యములనబడుచున్నవి. పింగళి కాటూరిగార్ల "సౌందరనందము", దువ్వూరివారి "రాణాప్రతాపసింహచరిత్ర", గడియారంవారి "శివభారతము", మధునాపంతులవారి "ఆంధ్రపురాణము", తుమ్మలవారి "బాపూజీ ఆత్మకథ" నవ్యాంధ్రములో పంచకావ్యములు అనబడుచున్నవి. శ్రీ నరసింహదేవర ఉమామహేశ్వర శాస్త్రిగారు "నవ్యాంధ్ర పంచకావ్యపరిశీలనము" అను గ్రంథములో సహేతుకముగా ఈ విషయమును నిరూపించిరి.

కవులు ప్రజాశ్రేయస్సును లక్ష్యముగా నుంచుకొని కావ్యములను నిర్మింపవలయును. అట్లురచించుచున్న కవులలో శ్రీ సీతారామమూర్తిగారు అగ్రగణ్యులు. వీరి కావ్యములు ఆంధ్రజాతిని మేలుకొలిపినవి. వీరు మంచిశీలముగల జాతీయ

కవులు. వీరిజన్మదినోత్సవమును జరుపుటయనిన భారతిని పూజించుట. పండుగలుజరిపినట్లు నాయకుల జయంతులు జరిపినట్లు కవులజయంతులు జరుపుకొనవలెను. ప్రజాసమస్యలను కవితా శిల్పమున చిత్రించి గానముచేసి ప్రజలను సత్యశివ సుందర మార్గమున నడుపునట్టివారే కవులు. అట్టివారిని ఆరాధించి సమాజము జవమును జీవమును పొందవలయును.

శ్రీ సీతారామమూర్తిగారి జన్మదినోత్సవములు ఆంధ్ర ప్రదేశమందు పలుచోట్ల జరుపబడినవి. అప్పికట్ల ఓడరేవు. కర్నూలు. చిలకలూరిపేట, చింతాయపాలెము, బాపట్ల, చీరాల హిందూపురము, తిరుత్తని, పామఱ్ఱు, నరసరావుపేట మున్నగు చోట్ల వారిజయంతులు జరిగినవి. వారిషష్టిపూర్తి మహోత్సవమును మదరాసులో జరిపించుటకు విపుల సన్నాహములు జరుగుచున్నవి.

"తమచే రచియింపఁబడిన 'ఆత్మకథ'ను జదివి ఆశ్చర్యమును, ఆనందమును జెందితిని. విషయము గాంధిమహాత్ముని స్వీయ చరిత్రము లోకారాధ్యమైనది. సర్వజనాదరణీయమును, సేవ్యమును. తమశైలి యించుమించు ఆంధ్రమహాభారత ప్రతిబింబము. ఇంతకంటె నెక్కువగాఁ జెప్పుటకు సాధ్యముకాదు—అవసరమును లేదు ........................ మాతృభాషయొక్క—సుకృతముల ఫలమనఁదగిన కావ్యమును—పూజనీయ విషయ శోభితమును, తదనుగుణమైన రీతిని వ్రాసి స్థిర యశస్సుగాంచిన కవులని మిమ్ము అయాచితముగఁ బ్రశంసించి నా కుతూహలమును తమకు నివేదించుచున్నాను."

"మహోత్సాహములకు, మహనీయమైన కార్యదీక్షకుఁ బురికొల్పు గ్రంథములలో సీయాత్మకథకు మించినది ఈ దేశమున, ఈ కాలమున మఱియొండులేదు. సరస్వత్యారాధనతోడ దేశారాధనమును జేసి శ్రీ...చౌదరి ద్విగుణీకృత కృతకృత్యుఁడైనాఁడు. మనకు రెండింతలు మేలుచేసినాఁడు. కావున వారి యెడ మనకు కొండంత గౌరవము కృతజ్ఞత యుండుట సహజము. తుమ్మల సీతారామమూర్తి మహాత్మునియొక్క ఆస్థాన కవి. ఈ స్థానము శాశ్వతము."

—కట్టమంచి రామలింగారెడ్డి.

"శ్రీ సీతారామమూర్తిచౌదరిగారు భాషాసంప్రదాయ సంరక్షణాభినివిష్టులై మడిగట్టుకొని కూర్చున్న శుద్ధ శ్రోత్రియ బ్రాహ్మణులు. కాని భావావేశమున వారు బహువడిగా, వాడిగా వర్తింతురు. రాష్ట్రగానములో, పఱిగ పంటలో ఈతీరు తిలకింపఁదగ్గది. ధర్మజ్యోతిలో వీరి కవితాధార దరులొరసికొని నిండారి పార్వాఱినది."

—వేటూరి ప్రభాకరశాస్త్రి.

తొల్లింటి కవుల ధర్మములు వీసమెత్తు కాదనుట వీరిష్టపడరు. రసభావ పరిపుష్టమైన రచనావైదగ్ధ్య మాయనలో కావలసినంత యున్నది. భావనిర్దుష్టము పలుకుబడి బింకమైనది. ప్రాత మాటలకు క్రొత్తపూత పూయు కూర్పునేర్పు చౌదరి కెన్నఁడో యలవడినది. ఉభయభాషలయందు చక్కని సాహిత్యము. సంస్కృతాంధ్ర శబ్దముల బరువులు ముదువులు పట్టి చూచి తూచి పద్యములలో సంధానింపగలుగుటలో సీతారామమూర్తి చేయి తిరిగిన చతురుఁడు. ఈయన సుశిక్షితుఁడు.

ధారాళమగు కైతకు తోడు సౌష్టవముగూడ నుండవలెను. దానికి సంస్కృతాంధ్రకావ్య పరిజ్ఞానమే కాక వ్యాకరణ ప్రవేశము గూడ విధిగా నుండవలెను. ఈ యుభయము చౌదరి గారిలో నున్నవి."

—శ్రీ నుడునాపంతుల సత్యనారాయణశాస్త్రి 'ఆంధ్ర రచయితలు'

మీలో పెక్కుమంది యెఱుంగని ముప్పదియేండ్లకు ముందటికాలముననే కుదురుకొన్న మా యనుబంధము అనవద్యము— అనశ్వరము.—

ఆయన కవితానుకుమారత - ఆ ప్రయోగ ప్రామాణికత - ఆ పదబంధరమణీయత - ఆ నిసర్గసౌమ్యత - నాకువెల్లపుడు గోచరించుచునే యుండును.

"సర్వః కాన్త మాత్మీయం పశ్యతి"

అని అభియుక్తుల సూక్తి.—

ఈ వ్యక్తి నాకు ఆత్మీయు డనుకొనుటవల్లనే రమ్యముగ గోచరించుచున్నదో— రమ్యమగుటవలననే ఆత్మీయముగ భావింపఁబడినదో- నిజము నిర్ణయింప సుకరముగాదు. ఉభయమును సంభావ్యమే. అసలు ఆ సూక్తికి ఈయర్థములు రెండును సంగతము లగునేమో! —సమన్వయదక్షులు యోజింపుఁడు.

ఆంధ్రభారతి యీయనకు చిరంతనాయుష్యమును నిరంతరారోగ్యమును చేకూర్చుకొనుఁగాక—

—దువ్వూరి వేంకటరమణశాస్త్రి.

ఋషి పుంగవా!

ప్రపంచ చరిత్రలో అపూర్వమగు అహింసావ్రతము పూని సత్యాగ్రహ సమరమున రవి యస్తమించని ఆంగ్ల

సామ్రాజ్యము నోడించి స్వాతంత్ర్యలక్ష్మిని చేపట్టిన బాపూజీ నేటి యుగకర్త. వారి యడుగుజాడల బ్రతుకుబాటల దిద్దుకొనుచు వారి దివ్యబోధనల లోకమున కందించు ఆత్మకథను తెనిగించి మహాత్ముని ఆస్థానకవులైన తమ తపోనిష్ఠ అతిలోక మనోహరము. అన్యదుర్లభము. మీకు మా యేటికోళ్ళు.

అభినవ తిక్కనా!

తిక్కయజ్వ కవితారీతుల పుణికి పుచ్చుకొని, ధర్మ వీరము ప్రధాన రసముగ గొని పవిత్రమగు కవితామృతమును పంచు మీ ప్రేమకు పాత్రములైన మా జీవితములు సార్థకములు. మా పురము పవిత్రము. మాకు చరితార్థత సిద్ధించినది. తెలుఁగు భారతికి మీ రొనరించిన సేవకు మా నమోవాకములు.

తెలుఁగు లెంకా!

మిమ్ము నెఱుగని తెలుగువాడు నాలుగు కోట్లలో మచ్చుకొకడైన కానరాడనుట అతిశయోక్తి కాదు. అవును తెలుఁగు జాతికొఱకు, తెలుఁగు ఖ్యాతికొఱకు, తెలుఁగు నీతికొఱకు తెలుఁగు భాషకొఱకు దినదినము క్షణక్షణము తపించు మిమ్ము గుర్తింపని తెలుఁగు వాడెట్లుండును? తెలుఁగువారికి రాష్ట్రము కావలెనని, తెలుఁగు సంస్కృతి స్వతంత్రమై వికసింపవలెనని, ఆరాటపడిన ఆవేదనపడిన కవులు నేడు మీవలె నెవరున్నారు? మీకు వెన్నెలలు, పూలతోటలు, విరహములు సెలయేటి పాటలు కొఱగానివి. తెలుఁగుజాతిలో ప్రసన్నత తెనుఁగుకీర్తికి క్రొత్తవన్నెలు తెలుఁగువారిలో అధర్మత్యాగము జాతీయ గానము మీకు పరమార్థములు. పరమ లక్ష్యములు.

ప్రజాకవీ !

మీరేది వ్రాసినను ప్రజలకొఱకే వ్రాయుచురు. ప్రజల సమస్యలే మీ కవితావస్తువులు. రైతులు, పేదలు; హరిజనులు. పల్లెటూళ్ళు, సంక్రాంతులు నూజిపిడులు మీ కవితా సృష్టిలో అపూర్వమగు శోభను, పవిత్రతను సంతరించుకొన్నవి. నేటి గ్రామసీమలలోని అహంకారము అధికారవ్యామోహము సోమరితనము పరికించి, మీవలె పరితపించి, వేడివేడి కైతలతో వాతలు పెట్టినవారు నేటి తెలుగు కవులలో ఎవరున్నారు ? మీరు కర్షకులు. మీ జీవనము గ్రామజీవనము అగుటచే మీరు మా హృదయముల గుర్తించితిరి. మా మంచి చెడ్డలు చూడగల్గితిరి. మాకు వలసిన సందేశ మీయగలిగితిరి, కావుననే మా గ్రామ పంచాయతిసభవారు మిమ్ము ప్రేమించుట గౌరవించుట, మీకీ సత్కారము గావించుట.

కర్షకబంధూ !

మీకు భగవాను డాయురారోగ్య భాగ్యములు పుష్కలముగా నొసంగునుగాక. మీరు నూతనోత్సాహముతో కవితా సృష్టి గావించి, ఆంధ్ర సరస్వతికి క్రొత్తక్రొత్త సొబగులు కల్పింతురుగాక. మీకును మాకును ఏర్పడిన మైత్రి సుస్థిరమగుగాక.

అప్పికట్ల,
6-3-58.

ఇట్లు,
గ్రామపంచాయతీ సంఘము.

# తెలుగు వెలుగు

ఆరడుగుల అతిగంభీరాకృతి; కండలు తిరిగిన దండి మైదండ; సింహమనసు; పల్లెటూరి పెద్దతనం ఉట్టిపడే ముతక ఉడుపులు; తెనుగుతనం తొణికిసలాడే ముఖవర్చస్సు; ముసి ముసి నవ్వులతో చూపరులను మోహితులనుచేసే సౌజన్యం; పలుకరించినవారికి ప్రత్యయం కలిగించే ప్రవర్తన; ఆత్మవిశ్వాసం, అంతశ్శుద్ధి అక్షరం అక్షరాన అనురణించే పలుకు బెళుకు; గుండ్లకమ్మ హోరుతో, హొయలుతో పరుగులువారే కంఠధ్వని; గుప్పెడు కారప్పొడితో, చేరెడు నేయితో మొదటి కబళం కలిపే తిండిపుష్టి—ఇవే శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు. ఈయన కావ్యాలు ఎన్ని తిరగవేసినా కానవచ్చే కమనీయ గుణాలకు ఇవే మూల ద్రవ్యాలు.

మోహనదాస్ కరమ్‌చంద్ గాంధీ ప్రవచన మధుకంధిని మథించి, అమృతాన్ని సాధించి, చౌదరిగారు కావ్యఖండములుగా, ఖండకావ్యములుగా గ్రథించారు. రాష్ట్రము, దేశము, జీవితము, స్వధర్మము మెట్లుగాతీర్చి, కవిత్వ విపంచిని సారించి అనుభవజ్ఞానం గానం చేశారు. అట్లాకవులై, కవులచేత సెబాసనిపించుకున్నారు.

కవులకు ఉండవలసిన లక్షణాలన్నీ శ్రీ సీతారామమూర్తిగారిలో పుష్కలంగా ఉన్నాయి. "పరమేశ్వరానుగ్రహము, పూర్వజన్మ సంస్కారము కవితాశక్తికి మూలహేతువులుగా" చెప్పబడినా, వాటిని నమ్మేవారు ఈకాలంలో అరుదుగనుక, కవికి ఉండవలసిన ఇతరముఖ్య లక్షణాలు ఏమో

చూచుకున్నా, శ్రీ చౌదరిగారిలో అవి మెండుగా కన్పిస్తాయి. చౌదరిగారికి భాషమీద అధికారం ఉంది. పాండిత్యం ఉంది. రమ్యంగా ప్రౌఢంగా, శబ్దాలను కూర్చగలశక్తి ఉంది. ఊహా బలము ఉంది. అన్నింటికి మించిన గాఢశీలం ఉంది.

శ్రీ చౌదరిగారికి అభినవతిక్కన బిరుదం ఉంది. అయితే చౌదరిగారి కవిత్వంలో తిక్కనముద్ర తక్కువ. శ్రీనాథుడు, పోతన్న, పెద్దన్న గారల ముద్ర ఎక్కువ. ఇందులో శ్రీనాథుని ముద్రను పట్టుట కొంతకష్టపడిన పక్షంలో తేలిక కావచ్చును గాని, పోతన్న గారు అట్లాసాధ్యం కారు. శ్రీ చౌదరిగారు కొన్ని పట్టులలో పోతన్న గారి పట్టును బాగా పట్టుకున్నారు. ఎంతో తపశ్శక్తి ఉంటేనేగాని ఇది సాధ్యంకాదు.

చౌదరిగారిని నిజంగా కవితా తపస్వి అన్నా తప్పులేదు. మహాత్ముని సత్యాగ్రహయోగాన్ని ఆయన సాధనచేశారు. సిద్ధిపొందారు. భారతదేశంలో గాంధీ యుగాన్ని తమకవిత్వంలో ప్రతిబింబింపచ్చేశారు. ఏమివ్రాసినా, ఆయన అనుభవం పరమార్థమై, రసం పిచ్చిలిస్తూ వుంటుంది. చౌదరిగారి వ్రాసిన "సంక్రాంతితలపులు" తెలుగు సాహిత్య సరస్వతికి శిరోభూషణములు. ఆ సంగతి కవికిగూడ తెలుసు అందుకే ఆయన "ఇవి బుక్కులమీద బుక్కులు" అని చెప్పుకున్నారు.

చౌదరిగారు మంచి రైతు. తరువాత బడిపంతులు. "ఒక మర్కటైవడిన్ గదలుచున్న రెయొడల్ కురిచీకి దత్తం" చేశారు. కాని ఆయన ఆ పంతులు అవడంచేతనే "కవిత పండింది." "సముజ్వల కావ్యసృష్టికిన్ సంతన కట్టి గెల్చితివి" అని ఎవరో అన్నట్లు కవిగారు కూడా చెప్పుకున్నారు.

ఎన్ని సార్లు చదివినా విసువు పుట్టనిది, ఎంత ఆకళించు కొన్నా ఆకలి తీరనిది ఈయన రచన. "రాష్ట్రగానం" చేసి, తెనుగు క్షేత్రమాగాణిలో "పెద్దకాపు" కాపించి, "పరిగపంట" ఏరి, "ధర్మజ్యోతి" వెలిగించి, మానవత్వానికి "అమరజ్యోతి" అయిన బాపూజీ "ఆత్మకథ"ను తెనుగు పద్యంచేసి "తపస్సిద్ధి" నంది, "శబల"తో తన రచనలకు శబలత చేకూర్చిన ప్రజా స్థానకవి ఈ అభినవ తిక్కన.

27—1—1960 ఆంధ్ర సచిత్ర వారపత్రిక.

కలదోయి! తెలుఁగుజోదుల తుటారికటారి
చెలరేఁగి పగఱఁ జీల్చినదినంబు
కలదోయి! తెలుఁగు రాజులు గంగగట్టుపైఁ
దీండ్రించి పడగలెత్తినదినంబు
కలదోయి! రేవు రేవులఁ దెలుంగు సరంగు
పైనఁగి లంగర్లు దింపిన దినంబు
కలదోయి! తెలుఁగుపల్కుల వెలంది-వెలంది
వెలుఁగు లెల్లెడలఁ బర్విననదినంబు
కలదు కలదోయి! తెల్గుప్రెగ్గడలు మున్ను
మిన్ను తోరంబుపైచి పేర్గన్న దినము
నేటి నీపాటు నెంచి కన్నీటి నిడకు
నిలుచునే కాల మొకలీలఁ దెలుఁగుబిడ్డ!

కమ్మని తెల్గటంచు నుడికారము సొంపుల నీ విశాల వి
శ్వమ్మున దీనిఁబోలిన వచస్సునభస్సునమంచు వేయి వా
క్యమ్ముల నేను మెచ్చుటయకాదు రసజ్ఞులుదారు లెల్ల ఖం
డమ్ముల మెచ్చి రిచ్చిరి వినమ్రతమైఁ గపురంపుటారతుల్ ॥

అదిగో! తెల్గులతల్లి దివ్యరథ ముద్యత్కాంతి పుంజంబులన్
బదిదిక్కుల్ వెలిఁగించుచున్ గదలెడిన్ బ్రస్థానభేరీధ్వనిన్
బధిరంబయ్యెజగంబు మీకుఁగల కాన్కల్ తల్లి కర్పించి తద్
రథమున్ లాగుఁడు మాతృభక్తి దయివాఱన్ దెల్గువీరాగ్రణుల్॥

—రాష్ట్రగానము.

దేవుఁడన మాతృదేశమ
దేవతలనఁ బ్రజల యజ్ఞదీక్ష యనంగా
సేవావ్రత నిష్ఠయ్యు యివి
జీవనసూత్రములుగాఁ బ్రసిద్ధింగనుమా ॥

—ఉదయగానము.

చెలఁగి మా స్తురఁ జించి చెండాడివైచిన
　　యభిమన్యుఁడే తల్లి యంక మెక్కె
చిచ్చఱపిడుగు పుంజీభూత శౌర్యంబు
　　బాలుఁడేయమ జోలపాట మెచ్చె

నెఱజోదు పగఱ గుండెలలోని గాలమై
మనిన శివాజి యే జననిఁగొల్చె
జగదేకవీర ప్రశస్త తేజోరాశి
జవహరుఁడేమాత చన్నుగుడిచె

నమ్మహాసాధ్వి సకలలోకైక జనని
భారతాంబకుఁ బండిన పంటవీవు
అన్నలకు మచ్చుఁదేఁబోకు మెన్నఁడేని
నుతగుణాధార! వీరభారతకుమార!

—పఱిగపంట.

ఏ శక్తుల్ తనకున్న నేమి పురుషుండెబ్బంగి రాణించు నీ
యాశీర్వాదబలంబు లేనియెడ నంబా! యుష్మదీయార్చనా
వైశారద్యము గోరువాఁడితఁడు నీ వాత్సల్య సంపత్తిలో
లేశం బీతనికిమ్ము పాలు; కవితా లీలారతీ! భారతీ!

—ఆత్మకథ.

ఉత్తమవాగ్మినానొప్పారెనురక గ
ర్జించియా కాదు వర్జించి నుడులు
అతిలోకబలసమంచితుఁడయ్యెఁ గండలు
పెంచియా కాదలయించి యొడలు

చిరజయశ్రీ ధురంధరుఁడయ్యె రిపుల ఖం
    డించియూ కాదు పండించి కృపలు
అమృతత్వమందె యాగము లాచరించియూ
    కాదు నిష్కామయోగము వరించి

యతఁడు సామాన్యుఁడెట్లు? పీరతకపూర్వ
జీనములు నోసి వాసిదెచ్చిన మహాత్ముఁ
డతని నడచిన బాటలయందు నడచి
పందయును సత్య విక్రమాస్పదుఁడయ్యె॥

నెచ్చనిగడ్డిపై నడుగువేయుచు మంచుమొయిళ్ళ బంటుగా
వచ్చిన సీతురక్కసికి వంగక గిత్తలబంతి దోలుచున్
బుచ్చిన కొయ్యలోఁ జివురు పుట్టునటుల్ నలిపాటపాడుచున్
రెచ్చిన జవ్వనంబును స్మరించెద నీ మకరోత్సవమ్ములన్॥

జాముసకొక్కముక్క వరుసన్ దనువంతయు రాష్ట్రసిద్ధికై
హోమముచేసి లోకములనూఁపి యభీప్సితమందుకొన్న శ్రీ
రాములు నందనందలతరాలకుఁగా నొకసారిపుట్టి-స్వ
క్షేమము నెంచి తాదృశుల శీలము జాతిజీర్ణించుకోవలెన్॥

—శబల.

సీ॥ నిత్యసత్యాలాపనియతిపై ననురక్తి
చెందినాఁడు జయంబు నందినాఁడు
పరవిత్తమదివిషప్రాయంబయని విశ్వ
సించినాఁడు తిరస్కరించినాఁడు
దీనార్థిలోకంబుఁ దిలకించి కన్నీరు
జార్చినాఁడండకుఁ జేర్చినాఁడు
మొగమోట దిగఁద్రావితగవు చెప్పెడి నేర్పు
నేర్చినాఁడు యశానఁ బేర్చినాఁడు

కష్టమున్ సుఖమున్ దుల్యదృష్టితోడఁ
జూచినాఁడొక త్రాసులోఁ దూఁచినాఁడు
నాఁడు నేఁడును బుధులు కొండాడునడత
నివ్వటిల్లిన నారయ్య కెవ్వరీడు॥

కం॥ ఏలావ్రతములు తీర్థము
లేలా జన్మములు చదువు లేలా యోగం
బేలా తపస్సు నరునికి
శీలంబది యింత చెక్కుచెదరక యున్నన్॥

చెమట నోడ్చి నరుఁడు జీవింపఁదగుఁ గాని
తేరసొమ్ము మెక్కి త్రేఁపరాదు
బానిసీఁడు కుడుచు పరమాన్నమునకంటె
నుచిత మిచ్చకోలఁది నొదవు గంజి॥

—ధర్మజ్యోత్స్న.

నిండీనిండని జవ్వనంపు సిరితో నిర్భాగ్యతాపూర్ణమై
పండీపండని కోర్కెతీవగుములోఁ బాధస్వరంగాభమై
యుండీయుండని మాయదారిబ్రతుకయ్యో యీలసాగించి, నన్
మండీమండని మొండిఁజేసితి వధర్మంబూని ప్రాణేశ్వరా

నీకు–సాక్షీవతంసవౌ నీకు–నిర్భ
రాత్మగౌరవ సంపూర్ణునైన నీకు
నిర్మలప్రేమచిహ్నమై నివ్వటిల్లు
నంకిత మొనర్తు నీకృతి నందుకొమ్ము॥

పరిశీలించిన యుష్మదీయమగు లోపంబున్నదే యింత దు
ర్భరచింతాహతబుద్ధినౌట నిను దూరంజొచ్చితింగాని యె
వ్వరికేనిం దురతిక్రమంబగు విధి వ్యాపారమూహైఁ బరా
దురితంబూరకపోదు శోకహత మెంచనే లోకమోహాపహా!

ఎండకు వానకు జంకక
పండించిన ధాన్యమెల్లఁ బాతఱలందున్
నిండించి తినుచుఁ బెట్టుచు
నుండెడి కర్షకుఁడె ధన్యుఁడూహింపంగన్॥

—ఆత్మార్పణము.

కర్మమందె నీకుఁగల దధికారంబు
లేదు ఫలమునందు లేశమేని
ఫలము వలచి నీవు సలుపకుమీ కర్మ
మియ్యకొనకు కర్మమీసడింప॥

—2-47. గీతాంజలము.

# జో హా రు

తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా ! నీకు జేజేలు

నినుఁ జూచి నినుఁ బాడి నినుఁ గొల్చువేళ నా
కను లాణిముత్యాల గనులుగా నగునహో !

తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా ! నీకు జేజేలు

నీపాలుజుంటి తేనియతేటలో గోస్త
నీ పక్వరసమో సుధాపూరమో యూట
నాపల్కులీ తీయనకు నోఁచి విశ్వ వా
ణీ ప్రపంచ ప్రశంసాపూరితము లాయె

తెలుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా ! నీకు జేజేలు

కుటిలశాత్రవకోటిగుండెలో నిదురించి
యిటుసేతు వటుగంగ యెల్లగా జగ మేలె
నటరాజకంధరా నైల్యమ్ము నడఁగించు
పటుకీర్తి పెంచె నీపట్టి యెంతటివాఁడో

తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా ! నీకు జేజేలు

ఎల్లోర కొండ నీ యల్లారు గీ మచే
కొల్లూరి కోహినూరు కొప్పులోఁ బూవటే
కొల్లారు గనులునీకోశం బటే పంక్తు
పుల్లనైపోవు నీ భోగమ్ము కన్నచో
తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా ! నీకు జేజేలు

గౌతమీ కృష్ణానదీ తుంగభద్రాది
పూతస్రవంతికా పుంజమ్ము నీముద్దుఁ
గూఁతులై నీచేను నీతోఁట పండింప
నీ తనూజులు పైఁడి పాఁతఁజల్ కప్పిరే !
తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా ! నీకు జేజేలు

ఏపుణ్యలేశమ్ము నాపాలిదాయెనో
నాపూజ కేలోకనాథుండు పొంగెనో
నీపావనోదర (శ్రీ) పరంపరలలో
నీ పదార్చకులలో నేను నొక్కఁడనైతి
తెనుఁగుతల్లీ ! నీకు జోహారు
దేశమాతా ! నీకు జేజేలు॥

—అభినవతిక్కన.

—:o:—

# సోదరా!

శ్రీలకెల్లను పుట్టినిల్లయి - శీలసంపద కాస్పదంబయి
మేలొసంగెడి తెనుగు సీమను - మేలుకొల్పుము సోదరా.
మూఁడుకోటుల తెలుఁగుబిడ్డలు - మోదమలరగ సంచరించుచు
వాడి మగటిమిఁ జూపి పెరుగగ - వాదమేలర సోదరా.

పాడిపంటల కొదువలేదూ - పైరు పచ్చల తరుగు లేదూ
పైడిపంటలె పండు నెలవులు - బాగుగాగను సోదరా.
కృష్ణ గోదావరి పినాకిని - తృష్ణదీరగ నమృత మొసగుచు
ఉష్ణతాపము వాప నాంధ్రులు - జిష్ణులైరిర సోదరా.

తుంగభద్రానది జలము - ఉత్తుంగమై యాకసముసంటు త
రంగపంక్తుల తెనుగు నేలను - రంగుమీరెర సోదరా.
తూర్పునను రత్నాకరేంద్రుడు - ఘూర్ణిలను గంభీరుడై కదు
నేర్పుమీరగ తెనుగుతల్లిని - నెసటునను గను సోదరా.

విజయనగరం బుత్తరంబున - విజయనగరము దక్షిణంబున
విజయవాటిక మధ్యఁ గల భువి - విజయరాష్ట్రము సోదరా.
ఒక్కదిశ మన కరవ సోదరు - లొక్కదెస కన్నడ భ్రాతలు
నొక్కనైపున ఓఢ్రబంధులు - చక్కగాఁ గను సోదరా.

ఇరుగు పొరుగు సహోదరాళిని - నెసక మొసగగ మైత్రితోడుత
కరము ప్రేమనుగాంచి రాష్ట్రపు - గౌరవము గను సోదరా.
తెలుగువీరుల శక్తి చిహ్నము - తెలుపుచున్నది విజయనగరము
తెలుగు కవులను రాణ్మహేంద్రమె - తెలుపుచున్నది సోదరా.

తిరుపతియు శ్రీశైలతీర్థము - స్థిరముగను భద్రాద్రిక్షేత్రం
బరయగను మన తెనుగుసీమను - అలరుచుండెర సోదరా.
శిల్పకళలకు తెలుగుగడ్డయె - శ్రేష్ఠమైనది భారతావని
అల్పమే యది దేశదేశా - లాక్రమించెర సోదరా.

ఎల్లొరా అజంత గుహలలో - ఎంతొ పనితన మలరియున్నది
మెల్లగా నీనడిగి కనుగొని - మేలునొందుము సోదరా.
హంపియందున రాజసభలో - కంపమొందిన స్తంభరాజము
సొంపుగను సప్తస్వరమ్ముల - నింపుగూర్చును సోదరా.

వాటి-జాత్యుల గానపటిమకు - దారినొసగిన త్యాగరాయలు
సాటిరా మన తెనుగుగానపు - శక్తి తెలుపగ సోదరా.
కవితలో గానంబులోపల - ప్రవిమలంబగు భక్తిసంపద
వివిధకళల ప్రశస్తిగాంచిన - దవురా! మన భువి సోదరా.

దేశభాషామండలములో - తెలుగు లెస్సని మెప్పు వడసెను
దేశభాష తెనుంగుసీమను - తీర్చిదిద్దర సోదరా.
ఆంధ్రరాష్ట్రమునంది రాజ్యము - ఆంధ్రముననే నడుపుకొనరా
ఆంధ్రమే నీ కోష్టుభాషగ - ఆదరింపర సోదరా.

తెలుగువారలు కష్టసుఖములు - తెలుగులో అధికారులకును
తెలుపగలుగ స్వారాజ్య మదియగు - తెలిసికొనరా సోదరా.
ఆంధ్రమంత్రులు ఆంధ్రనాయకు-లాంధ్రులెల్లను సర్వశుభముల
ఆంధ్రరాష్ట్రమునందు వెలయుత - అధిక జయముల సోదరా.

—"జయభేరి" నుండి



# ఉభయ భాషా ప్రవీణ
# శ్రీ జాస్తి వేంకటనరసయ్య రచనలు

1. వ్యాసవాణి— (1వ భాగము. సాహిత్యవ్యాసములు 0—50

"ఆంధ్ర భాషలో పలువిధములైన విషయాలు తెలిసి కొనేందుకు వ్యాసములు చాలా అవసరం. అలా యెవరు వ్రాసి అచ్చయినవి విపులంగా కనపడవు. వీరేశలింగముగారి రచనలలో కొన్ని ఉన్నా, అవి ఉపన్యాసాల త్రోవలో ఉన్నాయిగాని విద్యార్థులకు ఉపయోగించేవిగా లేవు. ఆ వెల్తిని శ్రీ వేంకటనరసయ్యగారు కొంత తీర్చారీ గ్రంథంతో. ఇందులో సాహిత్యము, కళారాధన, సంస్కృతి, లలితకళలు, గేయ కవిత, కవి, కర్మయోగి, పఠన మందిర గ్రంథాలయ లాభములు, చిత్రశిల్పములు అనే శీర్షికలతో తొమ్మిది వ్యాసాలు ఉన్నాయి. ఇవిఅన్నీ అందరికీ ఉపయోగించడం అల్లా ఉండగా విద్యార్థులకు బాగా ఉపయోగిస్తాయి.

---ఆంధ్రపత్రిక.

2. వ్యాసవాణి— (రెండవభాగము. అవశ్యపఠనీయము) 1—00

ఆంధ్రజాతి, కవి సన్మానము, ప్రేమ, అభినవతిక్కన, మతము, షేక్ ఫరీదు కవి, ఉపన్యాసకళ, కావ్యగాన కళ, విమర్శనకళ, భీమన్న రచనలు అను పది సాహితీ వ్యాసాలు.

3. ఖండకృతి— (5 వ ముద్రణ) 1—25

దేశాన్ని ఒక్కసారి పారజూచి అనేకరంగాల్లోని నేటి పరిస్థితులను పరికించి రచించిన ఖండకావ్యాల సంపుటి.

"ప్రతిష్ఠగల కవులుగ శ్రీ జాస్తి వేంకటనరసయ్యగారు తెలుంగులకు చిరపరిచితులు. మృదుమధుర శైలిని భాషలో జాలువారు తీయ తెనుగు పద్యావళిలో హీనుల దీనుల బాధ

తుల ఆక్రందనల చిత్రించే రసహృదయులు. ప్రతి పద్యము మననము చేసికొనుటకు శాశ్వతముగ పాడుకొనుటకు తగి యున్నది. ప్రతి యాంధ్రుడు చదువదగిన గ్రంథము."

—ప్రజామత.

4, 5. ఆంధ్ర సేవకులు– (రెండు భాగములు) 1–00

కాశీనాథుని నాగేశ్వరరావు, మాగంటి అన్నపూర్ణా దేవి, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, కోడిరామమూర్తి, అనే నలుగురు నాణెమైన ఆంధ్రుల జీవిత చరిత్రలు. "సేవాసక్తిని దేశభక్తిని, సంఘాభిమానమును కలించే రచనలివి. ఈ గ్రంథము పాఠశాలయందు గ్రంథాలయమునందు ఉంచదగినది. ఉపవాచకముగా నుండదగినది." —ఆంధ్రప్రభ.

6. ఉత్తమకథలు– (4వ ముద్రణము) 1–00

కందుకూరి, వీరేశలింగం పంతులు, భోగరాజు పట్టాభి సీతారామయ్య, తుమ్మల సీతారామమూర్తికవి చరిత్రలు.

7. నవగీతాలు– (జాతీయ గేయములు) 0–25

ఉత్తమాశయాలను కలిగించేవీ, ఉదార జీవితాన్ని చూపించేవీ, అయి, యీ గీతాలు, మనోజ్ఞంగా, ఉన్నాయి. విద్యార్థులు నేర్చుకోవటం మంచిది. —ఆంధ్రపత్రిక.

8. కవిత– (సంపాదన పద్యగేయరత్నాలు,) 0–50

9. వయోజనవిద్య– పెద్దల విద్దెకు తద్దయు తోడ్పడు) 0–25

10. వ్యాసవాణి (3 వ భాగము. అముద్రితము) 1–00

11. గాంధీమహాత్ముడు– (జీవితచిత్రణ. అముద్రితము)

12. శ్రీ రాచమల్లు కన్నయ్య సన్మాన సంచిక– (సంపాదన)

13. సర్వోత్తమకథలు– గాడిచర్ల హరిసర్వోత్తమరావు, రాచమల్లు కన్నయ్య, మద్దూరి రామిరెడ్డికవి చరిత్రలు 1–00

## శ్రీ డి. వి. సుబ్రహ్మణ్యముగారితోకలిసి వ్రాసినవి.

1. ప్ర జా రా జ్య ము– (సామ్యవాదనాటకము) } 1–00
2. ఉ పా ధ్యా యు డు– (ఏకపాత్ర నాటిక) }
3. చ లో ఢి ల్లీ– (బోసు వీరచరిత్ర బుఱ్ఱకథ) 0–75
4. జ య భే రి– (జాతీయపురుషులను ఖండకృతుల సంపుటి 1–25
   జాతికి నీతి రీతులను ఉద్బోధించే పద్యాఖ్యానములు)
5. కాంగ్రెసు విజయము– (నాటకం. 60 సం|| చరిత్ర) 1–00
6. వైతాళికకథలు– (విజయలక్ష్మి, అరవింద, మౌలానా
   ఆజాదుల చరిత్రలు) 0–75
7. జాతీయ కథలు– (అబ్దుల్ గఫ్ఫార్ ఖాన్, జయప్రకాశ్
   నారాయణ, అరుణ అసఫాలీ జీవితాలు) 0–75
8. ఆచార్య రంగా– (జీవిత చరిత్ర) 0–75
9. జాతీయ దసరాగీతములు– (నూతనజాతీయభావాలు) 0–15
10. సూఫీసూక్తులు– (షేక్ ఫారూద్ కవి పద్యరచన) 1–50
11. మాతృహృదయం– (గేయకథలు) వి. నాగమల్లారెడ్డి 1–00
12, గురుదక్షిణ– (సంపాదన. షేక్ ఆలీకవి) 1–00

"జాతీయ మధుర కవి" బిరుదాంకితులు, పండితులు, భాషా సేవకులు అయిన శ్రీ నరసయ్యగారు పాఠకలోకానికి చిర పరిచితులు. భాషాసౌలభ్యం భావ శబలత, వీరి కవితలో ద్యోతక మవుతుంటాయి. వీరు కవులేకాక దేశభక్తులు. గాంధీ దేవుని సిద్ధాంతాల నందుకొని వాటిని గేయాలుగా, కథలుగా అల్లి ప్రజానీకాని కందించటంలో నరసయ్యగారెంతో కృషి చేశారు. వీరు శ్రీ డి. వి. సుబ్రహ్మణ్యంగారితో కలసి వ్రాసిన కాంగ్రెసువిజయం, ప్రజారాజ్యం, ఉపాధ్యాయుడు,

మొదలగు గ్రంథాలు పైన చెప్పినదాని కుదాహరణలు. ఇవి గాక చలోక్తిల్లి, వైతాళిక కథలు, జాతీయ కథలు, ఆచార్య రంగా మొదలగు జీవిత చిత్రాలు రచించి వీరు ప్రశంస లందుకో గలిగారు. పిల్లల కుపయుక్తమగు రీతిగా నవ్య భావనలతో దివ్య సందేశాలతో వీరు వ్రాసిన దసరా గీతాలు, పెద్దల కుపయోగపడేలాగా వ్రాసిన "నవగీతాలు" చెప్పుకో తగ్గవి. ఖండకృతి, జయభేరి అను పద్య కావ్యాలు సాంఘిక కార్థిక రంగాలలో సమతను, మమతను, ఉద్బోధించే మధుర కృతులు. ఆంధ్ర సేవకులు, ఉత్తమ కథలు, ఆంధ్ర పురుషుల జీవితములను బాల బాలికల కందుబాటులోనికి తెచ్చిన పొత్తములు. వ్యాసవాణి" అను పేరుతో సాహిత్యవ్యాసములు రెండు సంపుటములుగా వెలువడ్డాయి. వీటిలో నరసయ్యగారి అసమాన పాండితి ప్రస్ఫుటమవుతూంది.

వీరికి కవితాపోషణ, కవి సన్మానము అంటే ఎంతో ఆసక్తి. భారతీసమితి అధ్యక్షులుగా వీరు చేస్తున్న సాహిత్య సేవ ఎన్నతగినది. ఇటీవల శిష్యులు వీరికి స్వర్ణోత్సవం జరిపి, తమ గురుభక్తిని తెలియపరచుకున్నారు. ఆ సందర్భములో నరసయ్యగారిపైన వ్రాసిన ఆశీస్సులు, ప్రశంసలు, "గురుదక్షిణ" అనే గ్రంథంగా వెలువడ్డాయి. జననం 1910. తెలుగు పండితులు. హయ్యరు సెకండరీస్కూలు, చిలకలూరిపేట,

గుంటూరుజిల్లా.

28-9-1960 ఆంధ్రప్రభ, వారపత్రిక. దసరా సంచిక.



# ఆంధ్రవాణి

"నీతీరు తీయముల్ నిగ్గు జగ్గులు సూచి
బ్రౌను బ్రహ్మరథంబు వట్టెనీకు
నీ ఠీవి నీ హొయల్ నీ బెడంగులు మెచ్చి
ఇబ్రహీం ఖానుకలిచ్చె నీకు
నీ సొంపు నీ పెంపు నీ యొయ్యార మెఱింగి
శాహాజీ పరిచర్య సలిపెనీకు
నీ తేట నీ పాట నీ నీటు దిలకించి
యఱవలెల్లరు ధ్యానులైరి నీకు

ముజ్జగంబుల నినుఁబోలు ముద్దుగుమ్మ
రసికతావేత్తలకుఁ గానరాదు గాదు
ఏ పురాపుణ్యలేశమో యిటకుఁ దెచ్చి
యర్చకుని జేసె నన్ను నీ కాంధ్రవాణి!"

కలవు సహస్రభాషలు జగమ్మున నందొకఁడేని తేనియల్
చిలికెడి తెల్గుతోడ సరిసేయఁగఁ జాలదు; విశ్వమెల్ల నీ
పలుకున కడ్డు సెప్పదు; సెబాసని విజ్ఞులు మెచ్చ సుందరో
జ్జ్వలకవితన్ సృజించి మనజాతికి నభ్యుదయమ్ము గూర్పఁడే

"తెలుఁగువాని కైత దేశదేశాలకు
నొజ్జబంతి యగుచు విజ్జఁగాక
ప్రాజ్ఞుఁడై కళాతపస్వియై విశ్వసా
హిత్యరాజ్య మాంధ్రుఁ డేలుఁగాక'

